# పండితాభిప్రాయములు

శ్రీ హయగ్రీవాయనమః

## — గ్రంథ ప్రశంస —

అఖిలభారతీయసోదరులారా!

ఈ గ్రంథకర్త తాను రచించిన మేరువంశపురాణమను గ్రంథము నా మూలాగ్రముగ చూచినాను. ఈగ్రంథము సర్వలక్షణలక్షితమగుచు పుర శైలిని గురిగొనినది. కవితయు నారికేళపాకము కాదనుట కౌతని పద్యశైలియే ప్రమాణము. ఇంకను రసాలంకారములు, శబ్దముల ప్రాందికయు, దూరాన్వయములేక యర్థసౌష్టవము దరిగొనుచున్నది గాన మిక్కిలి ప్రశంసనీయమై కవికులసాంప్రదాయానుగమ్యమై యుండుట కేమాత్రము సంశయము లేదు. సరసగుణాలంకార వృత్తానుశోభితము. ఇదిగాక సూర్యోదయాది వర్ణనముల జూచిన యెడల పూర్వకవుల ప్రబంధములకు సోదరభావము బొందుచు, సంస్కృత వాక్యబాహుళ్యము గాక, శుద్ధాంధ్రమయము గాక మిశ్రమ మగుటం జేసి మిక్కిలి మనోహరరూపమనుటకు సందియములేదు. ఎటులన పుండరీకా ప్రాణుల పరస్పర శృంగార కాలమున శృంగారరసప్రధానము వర్ణించి, వారి విరహము వర్ణించు సమయమం దపూర్వశైలిగా చంద్ర, పవన, మన్మథ, కోకిలాది దూషణమును బొందుపరచుచు, విప్రలంభశృంగారరసమును ప్రకటించుటవలనను, పుత్రోత్సవ, ఉద్యానవిహార వర్ణనములయందు వర్ణింపబడుచున్న శృంగారరసమే, యీ ప్రబంధమునకు ప్రాణమువలె ప్రాణస్థాయియై యుండుటవలన దీనికి స్థాయిభావముగా నెన్నుకొనబడినది. శృంగార రసము మరియు అంగముగాను విప్రలంభము, శాంతములును గలవు. ఎందన- పుండరీక గర్భధారిణియగు సమయమునందు గలదనవచ్చును. ఉత్ప్రేక్షాద్యలంకారములను గురిగొనినది గాన రసాలంకారప్రధానమనియు జెప్పవచ్చును. పౌరాణికపద్ధతి ననుసరించినది గాన దీనికి పై యలంకారము లంగభావము

# పండితాభిప్రాయములు

శ్రీ హయగ్రీవాయనమః

## —♦ గ్రంథ ప్రశంస ♦—

అఖిలభారతీయసోదరులారా!

ఈ గ్రంథకర్త తాను రచించిన మేరువంశపురాణమను గ్రంథము నా మూలాగ్రముగ చూచినాను. ఈగ్రంథము సర్వలక్షణలక్షితమగుచు పుర శైలిని గురిగొనినది. కవితయు నారికేళపాకము కాదనుట కౌతని పద్యశైలియే ప్రమాణము. ఇంకను రసాలంకారములు, శబ్దముల పొందికయు, దూరాన్వయములేక యర్థసౌష్టవము దరిగొనుచున్నది గాన మిక్కిలి ప్రశంసనీయమై కవికులసాంప్రదాయానుగమ్యమై యుండుట కేమాత్రము సంశయము లేదు. సరసగుణాలంకార వృత్తానుశోభితము. ఇదిగాక సూర్యోదయాది వర్ణనముల జూచిన యెడల పూర్వకవుల ప్రబంధములకు సోదరభావముబొందుచు, సంస్కృతవాక్యబాహుళ్యముగాక, శుద్ధాంధ్రమయముగాక మిశ్రమ మగుటం జేసి మిక్కిలి మనోహరరూపమనుటకు సందియములేదు. ఎటులన పుండరీకాప్రాణుల పరస్పర శృంగారకాలమున శృంగారరసప్రధానము వర్ణించి, వారి విరహము వర్ణించు సమయమం దపూర్వశైలిగా చంద్ర, పవన, మన్మథ, కోకిలాది దూషణమును బొందుపరచుచు, విప్రలంభశృంగారరసమును ప్రకటించుటవలనను, పుత్రోత్సవ, ఉద్యానవిహార వర్ణనములయందు వర్ణింపబడుచున్న శృంగారరసమే, యీ ప్రబంధమునకు ప్రాణమువలె ప్రాణస్థాయియై యుండుటవలన దీనికి స్థాయిభావముగా నెన్నుకొనబడినది. శృంగారరసము మరియు అంగముగాను విప్రలంభము, శాంతములును గలవు. ఎందన- పుండరీక గర్భధారిణియగు సమయమునందు గలదనవచ్చును. ఉత్ప్రేక్షాద్యలంకారములను గురిగొనినది గాన రసాలంకారప్రధానమనియు జెప్పవచ్చును. పౌరాణికపద్ధతి ననుసరించినది గాన దీనికి పై యలంకారము లంగభావముగ

తెలుసుకోదగినవి. వంశానుకీర్తనము మొదలుకొని పేరువంశాసాంతమువరకు
గ్రంథప్రతిపాద్యమగు విషయమును చక్కగా నిరూపింపబడి. అవాంతర
విషయవర్ణన లేకుండుటచే నీ గ్రంథము చూచువారికి విషయావగాహన తొం
దరగ చేకూరును. ఈ గాథ-యంతయు బ్రహ్మాండాది పురాణాంతర్గతమై
యున్నది. ఇందలి రసాలంకారాది యుక్త పద్యముల నుదాహరించుటకు
సాహసమున్నను గ్రంథవిస్తార మనునది నా సాహసము నతిక్రమించుట
వలన కవికులమున కత్యంత ముపాదేయమై విరాజిల్లుచున్నదని విరమించు
చున్నాడ.

ఇట్లు
శ్రీమాన్ వేదాన్త విద్వాన్
అమరవాది నరసింహాచార్యులు
గిర్మాజిపేట, వరంగల్.

చిత్రభాను సం॥
చైత్ర శు ౧ లు

విజయతాం రామానుజదివాకరః

[illegible]ంథకర్త చిరపరిచితుడని కాని, మిత్రుడను నభిమానముచేత
గాని, నేనీ యభిప్రాయమును వ్రాయలేదు. సహజంగా ఇతడు బాల్యవ
నుండియు సత్పురుషుల సహవాసముజేసి, యింతటి అపూర్వశక్తిని సం
దించుట సంతోషించదగిన విషయము. ప్రస్తుతము ఈ గ్రంథకర్త తన ప్రబం
ధములో ప్రథమాశ్వాసమునందు ౮ వ పద్యములో "మొదట నష్టాక్షరీమంత్రి
బోధజేసి, నట్టి పరవస్తు పాపయా-చార్యునెపుడు ... ... వేడుచుందు"
ననుచు, తన వంశపరంపరా దైవంబగు వేంకటనాథుని కీ కృతి సమర్పించుట
చేత నీతడు విశిష్టాద్వైత (శ్రీవైష్ణవ) మతప్రవర్తకుడని యీ గ్రంథపాఠ
కులు సులువుగా గ్రహింప గలుగుతారు. ఇక నీతని రచనావిశేషము విచా
రింపగా "ప్రాస లక్షణశూన్యమౌ - భావకవిత" యను ప్రథమాశ్వాసమ
నందు ౧౨ వ పద్యములో జెప్పిన కుకవినిందను చూడగా నీతడు లక్షణప్ర
కారముగా నలరు కవిత నామోదించుగాని లక్షణరహితమగు భావకవితాదు

జోలికిం బోడను విషయము పొడగట్టుచున్నది. ఈ గ్రంథమునం దనేకాలంకారము లిమిడి యున్నవి. వృత్త్యనుప్రాస విశ్రమాదులలో లోపము కన్పట్టదు, శబ్దముల కూర్పు లలితము. ఈలాటి విషయములతో గూడిన యీ కవిత సనాతనుల కవిత ననుకరించు చున్నదని చెప్పవచ్చును. ఇక కథా భాగము— మేరువారు ఈనాటి కెల్లరును తమ మూలపురుషుడని చెప్పుచు పూజించుచున్న శంకరదాసమయ్య చరిత్రనుండి యారంభించెనేమో యని తలంచితిని కాని, అట్లుగాక భృగుతనయులగు ధాత విధాతలు మేరువనువాని కూతులగు అయతి నియతుల బెండ్లాడిన విషయముల నుండి యారంభించినాడు. మన మీనాడు మేరువారని వీరిని బిలుచుట కీ కథయే యాధారము. ఈ కథ భాగవత బ్రహ్మాండ పురాణములందు గలదు. విధాతనుండి క్రమముగా ప్రాణ, ద్యుతిమంత, స్వనవాత నాగరీకుల నడిపించి, స్వనవాతునకు భగవంతుడు దర్శనమొసగి వస్త్రములను చించి, కవచాముల గుట్టి, శీతబాధ లేకుండా జేయుటకు దగిన యుపకరణంబుల నిచ్చినట్లు వ్రాయుటచే ప్రస్తుత కులాచార ధర్మకర్మ కనుకూలముగా నున్నది. మరియు శంకరదాసమయ్య చరిత్ర వ్రాయుటలో నాగరీకుని పుత్రిక ఛండిక యనియు, నామెకు శంకర వరప్రసాదంబున జన్మించిన బాలుడగుటచే శంకరదాసమయ్య యనియు, జడగిరియందు నివాసమొనర్చుటచే జడగిరి శంకరదాసమయ్య యనియు మొదలుగాగల విషయముల వ్రాసినాడు. ఈ విషయములన్ని బసవపురాణములో గలవు. ఈ శంకరదాసమయ్య కుమార్తె అంబిక. ఈమె భర్త కృష్ణాజి. ఇతని వంశములో నామదేవను నాతడు మాత్యపుచిప్పయందు జన్మించుటచే చిప్పె (సింపె) వారనియు, విధాత మేరుగిరి నాశ్రయించుకొని నివసించుటచే మేరువారనియు వీరి జాతిలో రెండు తెగలు కన్పట్టుచున్నవి. ఏది యెట్లున్నను సామాజిక ధర్మ కర్మల నిరూపించుచు, ఇట్లు కథ నడుపుట సామాన్యమైన విషయమనుట కవకాశము లేదు. దుర్భరకష్టపరంపరలకోర్చి యనేక గ్రంథముల బరిశోధించి వెంచి రచించిన యీ కావ్యకన్యకను దేవాదిదేవుడగు శ్రీ వేంకటేశ్వరస్వామి కర్పించి తన కష్టములకు దగిన ఫలముగా నీ

నాడేపల్లి అగదాసు సుకృతార్థుడైనాడు. ఈతని కా వేంకటరమణుడే అనేక సద్గ్రంథరచనాశక్తి ననుగ్రహించుగాక! యనుచు విరమించుచున్నాను.

ఇట్లు

శ్రీమాన్ ఠంయ్యాల వేంకట నరసింహాచార్యులు

చిత్రభాను సం॥ వైశాఖ బ ౧౦ లు

జ్యోతిష విద్యాలయము.
గిర్మాజీపేట, వరంగల్.

శ్రీమతే రామానుజాయనమః

గీ॥ కవిజనోద్గీతతతియుత ♦ గ్రంథచయము
లెన్నియో గాంచితిని గాని ♦ యిట్టి మేరు
వను పురాణమునం గల ♦ పలుకుల రుచి
గాంచగాలేదు యసమాన ♦ కవనధాటి.

గీ॥ నవరసోద్భాసి తత్త్వము ♦ నాగరికత
వంశచరితంబు సద్బోధ ♦ పద్యరచన
పూర్వకవిధాటితో సరి ♦ బోల్పవచ్చు
రసికజనసమ్మతంబు ఈ ♦ గ్రంథగజము.

ఇట్లు

చిత్రభాను సం॥ జ్యేష్ఠ శు ౫ లు

మాడభూషణం ప్రసన్న రాఘవాచార్యులు
నెల్లికుదురు, (నైజాం.)

సద్గురు సమర్థ.

నేను ఇరువదిరెండు సంవత్సరములనుండి బొంబాయిపట్టణమం దుద్యోగినై యున్నాను. మేరుకులజులు నాకు చాలామంది పరిచితులు. పరిచితులే కాక మిత్రులు కూడాను. ఒక సంవత్సరము క్రితము తమ కులోన్నతికై పాటుబడుచున్న 'శిలాంకోటి సామి' అనేవారు తమ మూలపురుషుండగు

శంకరదాసమయ్యపైర కొన్ని పద్యములు వ్రాయుమని నన్ను ప్రోత్సాహపరచ వారి యుత్సాహంబు మేరకు నా శక్తికొలది కొన్ని పద్యములు వ్రాసి విని పించితిని. అందులోని యొక పద్యము—

ఉ. ఎక్కుడు కష్టభారముల • కెంతయు నోర్చియు కట్టు వృత్తిలో
మిక్కిలి నేర్పుగల్గియును • మేదినిలో నతికెక్కువారి యీ
చిక్కులుబాపి మేదరుల • జీవకళల్ పునరుద్ధరింపగా
నిక్కవరింక మాకును ను • ధీవర! శంకరదాసమప్రభో!

ఇటుల వ్రాసియిచ్చిన భక్తిపూర్వకముగా గైకొని; వెంటనే పత్రికలద్వారా వెల్లడి జేసియుండిరి. అది మొదలు బొంబాయి మేదరుల ఐక్యేచ్ఛసంఘము వారు శంకరదాసమయ్య చరిత్ర వ్రాయుమని నన్ను పదేపదే కోరుచుండిరి. మూలగ్రంథమునకై వారి నడిగితిని. అందుకు పలువురు పలువిధంబుల జెప్పిరి. అట్టి దంత కథలంబట్టి వ్రాసిన బాగుండదని యేదైన పుస్తకము దొరకునేమో యని నాచేతనయిన వరకు పుస్తకాలయములన్నియు వెదకితిని. పలుచోట్లకు నుత్తరములువ్రాసితిని. దుర్లభమయ్యెను. తుదకు మహారాష్ట్రభాషలో నచ్చు బడిన బసవపురాణమం దొకచోట శంకరదాసు చరిత్ర సంక్షిప్తముగ నొక పేజి మాత్రమే వ్రాసియుండ జూచితిని. దాని నాధారంబుగాగొని వ్రాయు దమన్న కథ చాలా చిన్నదిగా నుండెను. కొంత కథను కల్పించి వ్రాసిన కులగ్రంథమగుటచే తప్పని తలంచి మానుకొని విచారించుచుండ, ఓరుగల్లు పురవాస్తవ్యులును, అచలగురు సాంప్రదాయ పీఠాధిపులును, నాయొక్క పరమ మిత్రశిఖామణియగు వాడపల్లి ఆగదాసుగారు ఈ మేదపురాణమును రచించి యా కొరంత దీర్చెను. ఇయ్యది బ్రహ్మాండపురాణము, భాగవతము, బసవపురాణము, భక్తవిజయము మొదలగు గ్రంథములయందలి కథల నాధా రముగా గొని రచించె, ఇట్టి సద్గ్రంథరాజమును మొదటి నుండి తుది వరకు చదివి సంతోషించినాడను. కథాభాగ మొప్పుదగియున్నది. గ్రంథము ప్రబం ధరూపకమగుటచే నిందలి పద్యములు పూర్వకవుల పద్యములబోలె విరాజిల్లు చున్నవి. నే జూచినంతవరకు గణ, యతి, ప్రాసాదుల దోషము లెవ్వియు

గానుపింపక ద్రాక్షాపాకమై యొప్పుచుండెను. కులాభిమానముగల ప్రతి మేరుకులరత్నాకర చంద్రుడు నిట్టి యుత్కృష్టగ్రంథరాజమును చదివి తీరవలయునని, కులోన్నతికై పాటుబడగలరని నా యభిప్రాయము.

ఇట్లు
శ్రీయుత వైశ్య రత్న కవిరత్న బిరుదాంకిత
చిదానంద చెర్వితాల భాగయ్యకవి
బొంబాయి.

1—6—42.
ప్రస్తుతం వరంగల్.

శ్రీసీతారామపరబ్రహ్మణేనమః

మహాశయులారా!

నే ననేక దివ్యక్షేత్రములు దిరిగి మతశ్రేష్ఠులైన భక్తుల జీవిచరిత్రలను వీక్షించి మా కులశ్రేష్ఠుడగు శ్రీ జడగిరి శంకరదాసమయ్యగారి చరిత్రను గురించి పురాణములయందు శక్తికొలది చూడడమే గాక మహాత్ములయిన పండిత భాగవతోత్తముల విచారించి యుంటిని. అట్టి పురాణములయందే కాని, మహాత్ములవల్లకాని కని విని యెరుంగక విచారించుచుండ నతి క్లుప్తముగా బసవపురాణములో నున్నది. కాని ఈ భక్తుని చరిత్ర మింక నే పురాణములం దుండునో, యెన్నడు బయలు పడునో, యెన్నడు వినెదనో యను నాశచే నువ్విళ్లూరుచుండ, వాడపల్లి ఆగయాఖ్య రాజయోగిగారు ఎచ్చటనుండి యెట్లు కనిపెట్టిరో కాని, భగీరథప్రయత్నముజేసి, యనేక పురాణములనుండి కథల సంగ్రహించి, కులాభివృద్ధికై "మేరువంశపురాణ" మను పేరుతో నీ గ్రంథరాజము నాంధ్రభాషయం దతివిపులముగా గద్య. పద్యములతో రచియించిన శంకరదాసమయ్యగారి చరిత్ర యొకటియే గాక మా మేరువంశపారంపర్యమును బయలుపరచిరి. ఇట్టి గ్రంథరాజము మా కులస్వాములందరు తప్పక జదివి, వంశపారంపర్యము తెలుసుకోగలరని కోరుచు, నా సంతోషమును దెల్పుటకై గ్రంథకర్త కాశీర్వచన పూర్వకముగ నీ క్రింది పద్యమును రచించి బహూకరించుచున్నాను.

సీ. పరవస్తువారికి ♦ పరమ శిష్యుండయ్యె,
భక్తులలో ♦ మేటి భక్తుడయ్యె
కావ్యంబు రచియించ ♦ కడుయుక్తి కవియయ్యె
గానమందున కళా ♦ గారుడయ్యె
మతములలో శ్రేష్ఠ ♦ మతము వైష్ణవుడయ్యె
కులములలో మేరు ♦ కులజుడయ్యె
బోధలలో పూర్ణ ♦ బోధాధికారయ్యె
దనరిన యీ ఆగ ♦ దాసుగారి

గీ. కాయురారోగ్య సంపద ♦ లాభిజాత్య
వంశ మభివృద్ధిగా జేయు ♦ వసుధ యందు
వేడుదును చాల నా యిలు ♦ వేలుపైన
మెట్టురాముని మణిగిరి ♦ మెలగువాని.

చిత్రభాను సం॥ కార్తీక బ ౧౦ లు

ఇట్లు
వాడపల్లి బుచ్చిరాములుకవి
మట్టెవాడ, వరంగల్.

శ్రీ వేంకటేశ్వరాయనమః

ఈ మేరువంశపురాణము మొదటినుండి తుదవరకు జదివి సంతోషించి నాడను. ఇట్టి సద్గ్రంథము మా మేరుజాతీయులకు మహోపకారి యగుచు, మా కుల మెట్టి గౌరవనీయమైనదో తెలుపుచున్నది. ఇట్టి గ్రంథము నింతకు ముందెవ్వరు వ్రాయకుండుటచే నీ గ్రంథరాజమును రచించి, వాడపల్లి ఆగ దాసు అఖిలమేరుకులంబునకు వన్నె దెచ్చియున్నాడని వేరుగా జెప్పనక్కర లేదు. మరియు కవిత్వమందేగాక కథాసరళియందుగూడ వినిర్మలభావములం గలవని నిక్కముగా వక్కాణించుచున్నాడను. ఈ గ్రంథకర్త యిటువలె నింకా కొన్ని గ్రంథములు రచియించి మేరుకులంబునకు మహోపకారం

బొనస్ప్యాలందులకు మా యిలవేల్పగు శ్రీమత్తిరుమల(తిరుపతి) వేంకటేశ్వర స్వామిని సదా ప్రార్థించుచున్నాను.

ఇట్లు
రాయభారపు వేంకటాద్రి
మట్టెవాడ, వరంగల్.

చిత్రభాను సం॥
మార్గశిర బ ౮ లు



## ఆశీర్వాదము.

సీ. సరవిగా కౌండిన్య ♦ స మహర్షి గోత్రంబు
వాడపల్లి యనంగ ♦ భవననామ
మట్టి వంశాబ్ధికి ♦ నమృతాంశు పోలిక
వేంకటేశుడు బుట్టె ♦ విధియుతుండు
నాతని పుత్రులు ♦ నయమార్గవర్తులు
ముగురు మూర్తులబోలె ♦ మురిపెముగను
గారయ నాముండు ♦ గౌరవనీయుండు
పాపయాఖ్యుండు శు ♦ భారతుండు
జగ్గయాఖ్యుడు నిత్య ♦ సత్యధర్మరతుండు
కనగ పాపయ భార్య ♦ కనకమాంబ
తద్గర్భ శుక్తి ము ♦ క్తాఫలంబుగ బుట్టి
సకల భాషల నేర్చి ♦ సంతసమున
రత్నమాంబను ధర్మ ♦ పత్నిగా జేకొని
వేంకటేశుని జేరి ♦ వేదవిధిగ
పరిపూర్ణ సద్బోధ ♦ నెరిగి తద్విధినంత
ధరణిలో సాటింప ♦ సరసవాక్య

ముల గ్రంథములుజేసి ♦ ముద్రించి పిమ్మటా
జాత్యున్నతికినయి ♦ సకలకష్ట
ములకెల్ల నోర్చియు ♦ ముఖ్యముగా మేరు
వంశపురాణంబు ♦ వరుస జేసి
యిహమందు పరమందు ♦ నెనలేని యశమును
ఆర్జించినావయ్య ♦ ఆగయాఖ్య

గీ. ఇట్టి నీకెప్డు సర్వేశు ♦ డింపుగాను
భోగభాగ్యంబు లిచ్చియు ♦ బ్రోచుగాక
జగతి నీ గ్రంథరాజమా ♦ చంద్ర తార
కార్కముగ కీర్తి బెంపొంది ♦ యలరుగాక.

ఇట్లు
వాడపల్లి లక్ష్మీనృపతి పంతులు,
వెలంపల్లి, తా॥ పర్కాల్, జి॥ కరీంనగర్.

చిత్రభాను సం॥
మార్గశిర బ ౧౩ లు

# పీఠిక.

శ్రీలక్ష్మీనృసింహ పరబ్రహ్మణేనమః.

శ్లో॥ వందే వేదాంత కర్పూర । చామీకర కరండకం ।
రామానుజార్య మార్యాణాం । చూడామణి మహర్నిశమ్॥

ఆస్తికాగ్రేసరులారా!

అనంత విశ్వమానవ సృష్టిలో నజుం డెంతటి స్వాతంత్ర్య పిపాసువో, కావ్యనిర్మాణమున కవులు గూడా నంతటివారే! సృష్టికారుడగు స్రష్ట తన కే వేళ, ఏచోట, ఏ పుణ్యపాపరూపకర్మాత్మక ఫలద్వయభోక్తలు సృజ్యులని తోచునో, ఆయా ఫలభోక్తలకు జీవులనే సృష్టించుచు నుండును. కావ్య

నిర్మాణకుతూహలులగు కవులుగూడా— తమ కే వేళ, ఏచోటు, ఏరూపము, ఏతీరు వర్ణనీయాంశములని తోచునో, ఆయా రీతుల నాయా వర్ణనీయాంశములనే వర్ణించుచుందురు. కనుకనే భీమకవి తన సామర్థ్యమును దెలుపుటకు రచించిన పద్యములలో— 'బిసరుహగర్భ వాత్రియును' అని ప్రపంచ సృష్టికారుండగు కమలాసనుని పద్యాదియం దిమిడ్చి, 'వేములవాడభీమకవివీరుని' అనుచు పద్యాంతమున కావ్యసృష్టికారుడగు తన నామమును రచించుకొనినాడు. ఈలాగే ప్రాచీనకవివీరుల రచనల జవిజూచు పురుషవర్యులు కవుల కవితాసృష్టి సర్వతోముఖమైన దనుటకు సాహసించకపోరు.

## —♦ కవి పరిచయము ♦—

ప్రస్తుత మీ మేరువంశపురాణమును రచించినది వాడపల్లి ఆగదాస గోత్రము— కౌండిన్యసగోత్రము. కనకమాంబా పాపయాఖ్యు లీ కవి తలిదండ్రులు. నివాసము ఓరుగల్లు (మట్టెవాడ). ఇతడీ పౌరాణిక గాథను ఆంధ్రదేశమునకు సీమాభూమియగు తిరుపతిక్షేత్రమున నాశ్రితసంరక్షణార్థము వెలుగొందుచు, తెనుగురాయడని వన్నెకెక్కిన వేంకటరమణునకు నొసగి కృతార్థుడైనాడు. ఈ విషయము లీ గ్రంథము ప్రథమాశ్వాసము ౧౬ పద్యమువలనను ఆశ్వాసాంతగద్యలవల్లను, తెలియుచున్నవి. ఈ అచలపరిపూర్ణబోధ ప్రచారకుడై పూర్ణానంద, రాజయోగి యను పదయుగళంబున ప్రసిద్ధుడై, తన్మతోద్బోధకములగు 'పరిపూర్ణబోధ మార్గదర్శిని' 'దేశికశతకము' అను గ్రంథద్వయమును రచించి వాసిగాంచెను.

## —♦ గ్రంథప్రాశస్త్యము ♦—

మేరువంశపురాణమను ఈ ప్రబంధమునకు భాగవత, బ్రహ్మాండపురాణములు మూలాధారములు. అందు బ్రహ్మాండపురాణము అనుషంగపాద ప్రథమాశ్వాసమున ౩౮౩ వ పద్యము మొదలు ౩౯౧ వరకు ౯ పద్యముల భృగువంశోత్పత్తి గలదు.

చ. మునివరుఁడౌ భృగుండనఁగ ♦ బ్రార్వ్యమొకంతు చెలంగు ఖ్యాతి నా
... ... ... ... న
త్తనయులు నైరి ధాతయు విధాతయు వారలలోన బెద్దదౌ
వనిత రమాఖ్య ... ... ... ॥

అను పద్యము మొదలు నాలుగుపద్యములలో భృగుమహర్షికి లక్ష్మి, ధాత, విధాతలను సంతానము గలదనియు, అందు పెద్దదియగు లక్ష్మి శ్రీమహావిష్ణువును జేపట్టి యనేక సంతానపరంపరల గాంచెనని వర్ణింపబడినది. శేషించిన ౫ పద్యములలో ధాత ఆయతి యను చేడియ నుద్వాహమాడి మృకండుం గనియె. మృకండునకు మనస్వినియను నారియందు మార్కండేయుఁడు గలిగె. అతనికి ధూమ్రియను స్త్రీయందు వేదశిరుఁడును, వేదశిరునకు పీవరియను చేడియయందు గులకర్తలగు మార్కండేయుల నేవార లనేకులు గలిగి యా సంతాన మతివృద్ధి నొందినదని ధాతవంశము ముగింపబడినది. విధాత నియతి యను కన్యను బెండ్లాడి ప్రాణుండను కుమారుం గాంచె ప్రాణునకు పుండరీక యందు ద్యుతిమంతుఁడు, ద్యుతిమంతునకు ఉన్నత, స్వనవాతులను కవ లుద యించినటుల వ్రాసి ఆరవ పద్యము—

క. వారల తనయులు పౌత్రులు
ధారుణి బహుసంఖ్యచేత ♦ దనరిరి వినుమీ
యీ రీతిఁ దత్సంతతి
భూరితరంబయ్యె భృగుని ♦ పుత్రితతి యిదే॥

ఉన్నత, స్వనవాతుల సంతానబాహుళ్యము చెప్పబడినది. ఇక భాగవతమున భృగువను ఋషికి ఖ్యాతియను భార్యయందు లక్ష్మి ధాత, విధాతలను సంతానము కలిగెను. లక్ష్మి విష్ణువున కర్ధాంగి యయ్యెనని మాత్రమే వ్రాయబడినది. బ్రహ్మాండపురాణమున లక్ష్మికి సంతానము కలిగినట్లు వ్రాసినను, భాగవతమున మాత్ర మా సంతానము వ్రాయబడలేదు. ధాత విధాతలు మేరువు అనువాని పుత్రికలగు ఆయతీ నియతుల వివాహమాడినట్లు వ్రాసి, ధాతకు మృకండుడును, అతనికి మార్కండేయుఁడు కలుగుటమాత్రమే వ్రాయ

బడినది. విధాతకు ప్రాణుడు, అతనికి వేదశిరుడు అను కుమారుడు కలిగినట్లు వర్ణించి ధాత విధాతల వంశములు ముగింపబడినవి. బ్రహ్మాండమున ఆయతి నియతుల తండ్రిపేరు వ్రాయకపోయినను భాగవతమున నా కొరత దీర్చినట్లు మేరువు అని వ్రాయబడినది. బ్రహ్మాండమున ప్రాణుని పుత్రుడు ద్యుతిమంతుడనియు, భాగవతమున వేదశిరుండని రెండు తీర్లుగా వ్రాయబడినది. కాని మరికొన్ని గ్రంథముల నవలోకింపగా బ్రహ్మాండపురాణమున వ్రాయబడిన ద్యుతిమంతుడను పేరే బలవత్తరమైనదని చెప్పవచ్చును. భాగవతమున నీ కథాభాగము తృతీయ స్కంధాదిని కర్దమప్రజాపతి సంతానవిమర్శనము నంగలదు ఈ రెండు గ్రంథముల నాధారముగా జేసుకొని 'బంగారమునకు వెలిగారము నంటించినటుల' యీ కవి పూర్వాగాథాలహరి, చంద్రవంశ చరిత్ర, మొదలుగాగల కొన్ని గ్రంథముల యందలి కథాభాగముల విమర్శింపుచు, బసవపురాణమునందలి జషగిరి శంకరదాసుమయ్యకథ నండగాగొని భక్తవిజయమునందలి కథావిధానము వర్ణింపుచు నీ క్రింది కథాసంగ్రహ ప్రకారము ఈ గ్రంథము పూర్తి గావించినాడు.

## —♦ కథాసంగ్రహము ♦—

### ప్రథమాశ్వాసము.

భృగుతనయులగు ధాత విధాత లొక్కతరి హేమగిరి విచిత్రదిదృక్షులయి చని, తత్ప్రాంత ప్రకృతిరమణీయంబుల గాంచుచు, మేరు కుమారికలచ్చటి జాబూనది జలక్రీడలొనర్చి గృహోన్ముఖులగుట గాంచి, మదనధనుర్విముక్త శిలీముఖంబుల కెరయై, యా బాలికలం డాసి పరస్పరపరిచయంబు గలిగించుకొన నక్కాంత లిలుజేరి, తండ్రి కా మునిదారకుల నుద్వాహమొనర్చుకొనుట తమయభిమతంబన నమ్మేరువు వల్లెయని, ధాత విధాతల రప్పించి వివాహవిధుల దెలుప వార లతిరయంబున నిజాశ్రమంబున కేతెంచి, పితాజ్ఞం గొని పోయి ఆయతి యను నాతిని ధాతయు, నియతి యను నారిని విధాతయు సాంప్రదాయికదీక్షావిధానంబున నుద్వాహంబునొనర్చుకొని నిజా

శ్రమంబుల సుఖంబున నుండె నంత, కొంత కాలమునకు అయతి నియతులు గర్భముల ధరించి పదియవమాసంబున శుభగ్రహవీక్షణాది సకలసద్గుణయోగ విరాజమానంబగు ఒక ముహూర్తంబున మృకండు డనువాని నయతియు, ప్రాణుండను దారకుం నియతియు గని పుత్రలాలనోత్సాహంబు చెలంగ, మృకండుడు దినదిన ప్రవర్ధమానుండై యుక్తకాలంబున నిర్వృత్త కర్ముండై మార్కండేయుండను కుమారునిం గనియె. ఇక ప్రాణుం డుపనీతుండై తండ్రి పంపున వసిష్ఠుని వద్ద విద్యల నభ్యసింపుచుండ, యువతీజన మనోహరంబగు యౌవనోదయంబయ్యె. అత్తఱి వసిష్ఠ పుత్రికయగు పుండరీక యను జవ్వని యనురూపవయోవృత్తంబులు గలిగియుండుట బుండరీక ప్రాణుల కన్యోన్య దృష్టిప్రసరణాది వ్యాపారంబుల బరస్పరప్రేమాంకురంబయ్యె, నంత బ్రాణుం డవశిష్టవిద్యుండై నిజాశ్రమప్రవేశకాల మాసన్నమౌట నా యువకుల మనో విప్లవకారణంబైన నెట్టకేలకు అసమానమనోవ్యసనుండై ప్రాణుడు నిజాశ్రమ ముం బ్రవేశించె. ఇచ్చట పుండరీక ప్రాణుడుండలేని కారణంబున కందర్ప దర్పిత పరాక్రమమునకుం గురియయ్యె ప్రియవియోగానల దందహ్యమాన హృదయా వేదనా పరంపరల ననుభవించి తుద కలసి సొలసి స్మృతిహీనయై కుసుమశయ్యం బడ తోడిచెచ్చెలు లతి విషణ్ణలై వసిష్ఠునిం గని విన్నవించ నిజయోగమహిమ సాక్షాత్కృత సర్వవృత్తుండగు వసిష్ఠుం డొక యంతేవాసి నంపి ప్రాణు రప్పించి కన్యాదానమొనర్చిన యంత నయ్యువకులు విగత మదనద్వేషులై నిజాశ్రమప్రవేశమొనర్చి యనంగసంగరాతిక్రాంత కతిపయ వార్షికులై యుండి

## ద్వితీయాశ్వాసము.

అంత గ్రీష్మఋతుకాలం బాగతంబగుటం గని యా యువకులు హిమ గిరి పరిసర పుణ్యక్షేత్ర సందర్శనంబున కనుకూలంబని సంతసించి కొండొక శుభముహూర్తమున నిలు వీడి పుణ్యనదీనద పవిత్రీకృతదేహులై చని చని, సంసారసాగరాంతర్నిమగ్నాఖిలజంతు మోక్షప్రదంబగు బదరికావనిం జొచ్చి

నారాయణుం గాంచి పుత్రార్థులై పూజించి నుతింపుచుండ నాతు డేతెంచి 'వత్సా! నను బోలు పుత్రుం బడయుదు. రేపు పర్వదినమగుట నిచ్చటి మిన్నేటి నఘమర్షణస్నానం బాచరించి నిజావాసమునకుం జను మంత నీవు శుభంబగు' నని సెలవిచ్చి చనిన ప్రాణుం డట్లాచరించి నిజావాసమున కేతెంచిన కతిపయ కాలంబునకు దేవబ్రాహ్మణదత్త వర ప్రభావంబున బుండరీక యాసన్నసత్త్వయగుట కెంతేని ప్రాణుండు తనమనంబున నలరియుండ నొకనాడు పుండరీక 'నాథా! జీవుడీ గర్భమున నెట్లు ప్రవేశించు? గర్భస్థుడగు జీవి యేతీరు గర్భముక్తుండగును? తదుపరి యా జీవిపొందు అవస్థావిశేషములెవ్వియో వివరింపు' మన బ్రాహ్మణుండు సంతసించి 'సతీ! జీవుడు నిజారబ్ధకర్మవశంబున ఆకాశాదిపంచమహాభూతంబులందు గొన్నినాళ్లావాస మొనర్చుకొని తన్మూర్తుడై యోషధులం బ్రవేశించి, తన్మూలకముగా పురుషునిరేతస్సునం జొరబడి, స్త్రీపురుష సంయోగ మూలకముగా స్త్రీగర్భమునం బ్రవేశించు' నని గర్భ, జనన, బాల్య, కౌమార, యౌవన, వార్ధక్య, మరణావస్థాది వివిధ విషయంబుల నెరింగించుచు కాలముం గడుపుచుండ బదియవ మాసమున మహాతేజస్వియగు బాలుడుద్భవించె నంత వసిష్ఠాదు లేతెంచి, యబ్బాలుని తేజోవిశేషంబుల కలరి, ద్యుతిమంతుడని నామకరణ మొనర్చి, యెవరి నివాసంబులకు వారు జనిన, నిక్కడ బాలుడు శుక్లపక్షసుధాంశు రీతిం దినదినాభివృద్ధినంద, యుక్తకాలంబుల నిర్వృత్తకర్మంజేసి, గర్భాష్టమంబున నుపనయనంబును నెరవేర్చి, వసిష్ఠునకునొప్పజెప్పిన నమ్మహర్షి దౌహిత్రు న్వెంటదీసుకొని నిజాశ్రమంబు జేరి సాంగోపాంగముగా నామ్నాయంబుల బోధించిన ద్యుతిమంతుడు కుశాగ్రబుద్ధియగుట ననతికాలంబుననే పఠితాఖిలామ్నాయుడై యొకనాడు మాతామహుంగూర్చి భగవత్పరత్వాద్యవస్థాపంచకమును దెలుపుడని ప్రార్థింప, వసిష్ఠు డాయా విషయముల వక్కాణింప ద్యుతిమంతు డత్యంతానందహృదయుడై 'మహాత్మా! ఏ యాశ్రమమున నే తీరు భగవద్దర్శనమగునో సెలవిమ్మన నబ్బాడబుండు 'వత్సా! బ్రహ్మచర్యాద్యాశ్రమచతుష్టయమున గార్హస్థ్య మతి శ్రేష్ఠము. దాన సంతానము వృద్ధసి,

సన్న్యస్తసర్వకర్ముండైన జ్ఞానికి సర్వేశ్వరుండు సులభసాధ్యుఁడని కొన్ని విషయముల దెలియ బలికిన ద్యుతిమంతుడు నిజాశ్రమప్రవేశ మొనర్చి కొంతకాలంబునకు సుగంధియను ఒక కన్యక నుద్వాహించి సుఖంబున కొన్ని సంవత్సరములు గడుప ద్యుతిమంతుని హృదయమున సంతానవాంఛ యంకురించిన యంత నిజసతిం గని 'ప్రేయసీ! సంతానార్థ మరణ్యమున ఘోర తపంబాచరించి సుతుంబడసివచ్చెద' ననుచుండ నారదుండే తెంచిన నిరువు రరణ్య ప్రవేశ మొనర్చిన నారదుండష్టాక్షరి మంత్రరాజ ముపదేశించి యంతర్హితుం డగుటయు నవ్విప్రుం డేకచిత్తత నేకపాదాగ్రంబున నిలచి తప మొనరించుట గాంచిన ఇంద్రుడు భీతుడై యప్సరస్సాంగనల బుత్తెంచిన వారలు విఫలమనోరథలై యరుగుటచే నినుమడించిన భయముతో సునాసీరుండు కమలాసను నొద్దకుం జనిన నచ్చతురాననుడు నిఖిల దేవగణ పరివృతుడై క్షీరోదధికిం జని ప్రార్థింప నయ్యాదిదేవుఁ డా విధాతకు సాక్షాత్కరించి యభయం బొసంగిన నెవరి వాసంబులకు వారు జనిన పిమ్మట సర్వేశ్వరుడు ద్యుతిమంతునకు దర్శన మొసగి 'వత్సా! వరమడిగిన నొసంగెద లెమ్మ'న ద్యుతిమంతుఁ డా నారాయణుని ననేకవిధముల స్తుతించి భగవద్దర్శనానందసాగరనిమగ్నచేతుడై, వక్తవ్యముస్మరించి మోక్షమర్థించుటయు, భగవంతుఁ డా ద్విజు నవలోకించి 'నీవు సంతానేచ్ఛ దప మొనరించినందున సంతానాత్పర మట్లే మోక్ష మొసంగుద. నీ సంతానమూలకమున కొన్ని కార్యములు కొనసాగనున్న' వను విషయముల కొన్నిటి వివరించి యంతర్ధానమునొందె. ద్యుతిమంతు డమందానందముతో నిలు బ్రవేశించిన కొంతకాలంబున కొక శుభముహూర్తమున ఉన్నత స్వనవాతులను కవలుదయించిరి. అం దున్నతు డుద్బోధితజ్ఞానుడై వైరాగ్యప్రవృత్తి దప మొనర్ప జనియె. ఇచ్చట స్వనవాతు డాటపాటలయందును, వాక్పరిచయమునకూడా రమేశునామస్మరణము దప్ప నన్యముల మాటలాడకుండెను. ద్యుతిమంతు డొక యుపాధ్యాయు గల్పించి, కుమారున కక్షరస్వీకరణ మొనర్పించి పాఠశాలకు బంపిన నచ్చట. స్వనవాతుడు తోడి బాలుర నొకచోటికిం జేరి వారలకు ఈ విద్య లసత్కల్పంబు లనియు, హరి

నామస్మరణ మహాత్మ్యము బోధించిన యా బాలుని అపూర్వోపోద్ఘాతమునకా పిల్లలెల్ల రలరి, నారాయణనామపారాయణ మొనర్పసాగిరి. అంత నుపాధ్యాయు డరుదెంచి, యా విషయములనెల్ల గని కుపితుడై, ఇందుకు కారణభూతు డీ స్వనాతుడని యూహించి వానిం జేరి, నీ కీచటనుండిన నీతోపాటీ బాలురకూడా నాఘ్రాతవిద్యాగంధులు కావలసినదే యని, బాలున్నింటనిడుకొని ద్యుతివంతు దరిజేరి జరిగిన విషయములం దెలుప నా భూసురుడంతు సరియని యథోచితసత్కారం బొనర్చిన నుపాధ్యాయుడు స్వీకృతోపహారుడై, స్వనివాసమున కరిగె. ఇచట స్వనాతుని కుపనయనసంస్కారంబొనర్చి, కౌండిన్యమహర్షితో బంపిన, కొంతకాల మాచార్యశుశ్రూషలొనర్చి, గృహీతాఖిలామ్నాయుడై, యష్టాక్షరీ మంత్రోపదేశంబు నొంది, గురునియాజ్ఞం గొని, హరినామస్మరణావేశమున సొక్కుచు, సోలుచు, నిజాశ్రమంబు జేరబోవు మార్గమధ్యమున శ్రీహరి సాక్షాత్కరించిన సంతోషంబున నుతింప నీశ్వరుడు ప్రసన్నుడై 'వత్సా! నీ వతి భక్తుడవైనందున నీచే లోకమునకు కొంత ఉపకార మొనరింపజేయ నరుదెంచితి. ఇవిగో! తదుపకరణములని కత్తెర, గజము, సూచీ, అంగుళీముద్రి యొసంగి; వీనిచే లోకమున శీతబాధాపనోదమగునట్లు కవచాదినిర్మాణ మొనర్పుము. ఇచటి కనతిదూరంబున మునిపల్లెగల దందు సోమేశ్వరు పుత్రిక నుద్వాహమాడి, గృహంబున కేగు' మని యంతర్ధానంబు నొందె, స్వనాతుండు కవచనిర్మాణోపకరణంబులం గొని, మునిపల్లె బ్రవేశించి సోమేశ్వరపుత్రికయగు మానవతీ కరగ్రహణ మొనర్చి, నిజాశ్రమమును బ్రవేశించి, కవచనిర్మాణ ప్రదానంబుల జనుల సంతోషింప జేయుచుండ, నాగరీకుండను కుమారుడు జనించె. నాగరీకుండుక్తకాలంబుల నిర్వృత్తకర్ముడై, గురుకులంబున నన్నివిద్యల నధ్యయన మొనర్చి, దేశదేశంబులం దిరుగుచు, కల్యాణపురంబునకుం జని యచ్చటి విమలయను అమలచరితం జేపట్టి, అత్తమామ లపుత్రికులగుటచే నల్లునకే సర్వస్వము నర్పించి తపేచ్ఛ నడవికిం జనిరి.

## తృతీయాశ్వాసము.

నాగరీకుం డత్తింటనే కాలము గడుపుచు ఛండికయను కుమారిం గనియె. ఆ ఛండిక శైశవము నుండియే శర్వునం దనురక్తయగుటచే నితరుల ధిక్కరింపుచు, కతిపయకాలంబునకు ఛండికేశ్వరవరప్రదానబీజవిన్యాసప్రభా

వంబున శంకరదాసను తనయునిం బడసె అబ్బాలుండును మహేశ్వరదత్త వరప్రభావజాతుండగుట నతిజ్ఞానియై కర్మల ధిక్కరించి, రామనాథుండను యోగీశ్వరుచే పంచాక్షరి నుపదేశము వడసి మహేశు నారాధింప భర్గుండు సాక్షాత్కరించి 'వత్సా! వరము న్వేడు' మనుటయు భక్తుడు. 'దేవా! నా కెట్టి వరమువలదు కాలవిభాగ రహితముగా నూదిం దాగమినుటు కంధత్వము లేకుండు నట్లు వరమొసంగు' మన పశుపతి సంతసించి భక్తునకు నిటల నేత్ర మొసంగి యాపై మరికొన్ని వరములొసంగి యంతర్ధానమగుటయు నాశంకరదాసచ్చటనే యాశ్రమం బేర్పరచుకొని కొన్ని యనుష్ఠానవర్య లొనర్చుచుండ పర్వతశ్రీ యను ఒకతరుణి యరుదెంచి దాసుమయ్యా నారాధింపుచుండ శంకరునకు స్వప్నమున శంకరుడు సాక్షాత్కరించి యావనితన్వివాహ మాడుమని యంతర్ధానంబునొంద శంకరదాసు మేల్కని సర్వమంగళా పాణిగ్రహణ మొనర్చె నా వెయందు భగవద్భక్తులకు కొమారులను అంబికయను నొక కూతురునుంగని సంతోషంబున నుండ కొంతకాలంబున కొక రాజన్యుండగు నరుసోజి యను నాతడు శంకరదాసు సమీపంబున కరుదెంచి పుత్రభిక్ష న్వేడ దాసారాజును కరుణించి యాతని కంబిక నిచ్చె నరుసోజి యమందానందమున నా యంబికం గొంపోయి కృష్ణాజి యను నాతని కిచ్చి కన్యాదానం బొనర్చె నామెయందు సంతాజీ మాండ్కాజీ దేవుజీ యను మువ్వురు కుమారులు గలిగిరి. అందు సంతాజి కాంచీనగరంబున నానందియను కన్నియం జేపట్టి ఆ యువతీ యందు పాండురంగడు జ్ఞానదేవను కుమారులం గాంచె. పాండురంగడు దానాయి యను చేడియ యందు లింబాజి బావాజి భగవంతు సకోజి యను నల్వురు పుత్రులంగనియె నందు సకోజి బృందావనంబున తుకాయి యను నారి న్వివాహ మాడి యామె యందు దామాజి యను తనయునిం బడసె దామాజి యుక్త కాలంబుల సకల కర్మల న్ముగించుకొని పితరులచే ననుజ్ఞాతుండై పుణ్యక్షేత్రంబుల దర్శింపుచు పండరిం జేరి యచ్చట గుణవతి యను కన్యక నుద్వాహమాడి సంతానంబునకై పండరి నాథుం బ్రార్థింప నప్పరమేశుడు స్వప్నంబున సాక్షాత్కరించి చెప్పినప్రకారముగ దామాజి ప్రాతఃకాల కృత్యముల నిర్వర్తించుకొని చంద్రభాగకుం జన నందొక ముత్యపుచిప్ప ప్రవాహవశంబున వచ్చుచుండ దానిం గని గ్రహించి విప్ప నందు బాలుం డగుపడియె నద్దారకునకు పండరినాథుని యాదేశ ప్రకారంబుగా నామదేవను నామకరణం బొనర్చ నబ్బాలు డుద్దీప్తుడై యభివృద్ధి నొందుచుండ, రాధా

బాయి యను నామె నుద్వాహ మొనర్చి గుణవతీ దామాజులు కృతకృత్యు లైరి. వాసుదేవా కాంతతో కందర్ప విహారంబుల కొంత కాలముం గడపి నామెయందు నారాయణ నామ పారాయణ పరాయణులగు కుమారుఁ నొక కుమార్తెం గాంచి శ్రీకల్యాణదాయకుండగు పాండురంగనియందశ్ కాలయాపన మొనర్చె.

## —♦ రచనా విశేషములు ♦—

ఇక నీ ప్రిబంధము మూలగ్రింధమ్ములం దుండు కథావిధానము నా లంబనముగా గొని వ్రాయబడినదగుట నిందలి పద్యములు మూలప్రబంధముఁ లోని పద్యముల ననుకరించుచున్నవి. పూర్వ గ్రంథానుసరణంబులగు పద్య ములు వాని మాతృకలు పాల్కురికి సోమనాథుని బస్వపురాణము చతుర్థా శ్వాసము

ద్వి॥ గర్తల కర్తమత్కర్తవై నీవు, కర్తింప నింకొక వరమేల వేడ।
రాత్రియు సూది దారంబు గ్రువ్వంగ, నేత్రములకు దృష్టి నెలకొల్పు
గీ॥ ... ... ... ...

సూదిలో దారముం జేర్ప ♦ సులువు రాత్రి
బవలునందున గన్పడు ♦ వరము దప్ప. మే॥ పు॥ 3 ఆ

సీ॥ ప్రితి నిమేషము పర ♦ బ్రహ్మము వీక్షించి
మది జొక్కి వెలుపల ♦ మరచువాడు ॥భాగ॥ ౧ స్క 3 ఆ

సీ॥ ప్రితి నిమేషంబున ♦ బరమేశు వీక్షించి
చిత్తాన సౌఖ్యాన ♦ చిత్తుమరచు మే॥ పు॥ 3 ఆ

ననుకరించుచు బింబ ప్రితిబింబములుగా వర్ణింపబడినవి. వర్ణనాంశము లాయా స్థలములందు నాతిదీర్ఘములై సమయోచితంగా పాఠకులకు విసుగుజనించు కవకాశము లేకుండా 3. ౪ పద్యములలో వర్ణింపబడియున్నవి. సాధా ణంగా కవులు తమ వాక్పటిమంజూపు సంకల్పంబున యమక, శ్లేష దుష్కరప్రాస, బంధ భావోద్రేకాది లక్షణములతో సమాసైక పద్యము (చరణములు) గా వర్ణించుట సహజము. అందు మూలమున సాధారణ మ వులకు కథాసారస్య మవగాహ మగుట దుర్లభము. ఈ ప్రిబంధమున నట్లు గాక ప్రథమాశ్వాసమునందు స్త్రీవర్ణనము ప్రకృతి కనుకూలముగా వనవస

గ్రీష్మాది వర్ణనములు కాముక జనహృదయోద్వేగములగు మోహాది వివిధవర్ణనములు, ద్వితీయాశ్వాసమున పిండోత్పత్తి క్రమంబును బాల్యాది పంచావస్థా విశేషములును, మోక్షమార్గ క్రమంబును, పరాత్పరుని పంచావస్థా విశేషములును, తృతీయాశ్వాసమున భక్తజన మహాత్మ్యము, పుండరీక వర్ణనము మొదలుగాగల వర్ణనముల నతి మృదుమధుర వాఙ్మయమున పండిత పామర జనంబుల కర్థావగాహమగునటుల వర్ణింపబడినవి సౌందర్య వర్ణనాదికములు స్వీయోహాపోహార్థ విజ్ఞానమున లలితపద ప్రయోగములచే నెట్లు వర్ణింపబడినవో తెలియనగును. ఈ ప్రబంధమునందలి నాయకులు మాత్రమే మూల గ్రంథములవారు కథాకల్పన వర్ణనాదికములు, కవుల స్వతంత్రమే అందుచే నిందలి వర్ణనాది భావములలో పూర్వ కవివర్ణనా సంయోగము గానవచ్చుచున్నది. నవీన కవులతో కలసి పురాతన కవిశిల్పముల నవగాహన మొనర్చుకొను భావోద్రేకి ఈ కవియగుటచే సారస్వత లక్ష్యములకు పూర్వ కవిప్రయోగరీతులకీ ప్రబంధమున దావొసగబడినది. ఇట్టి భావోద్రేకకర నూతన మార్గముల కావాసము నగు ఈ ప్రబంధమునందలి పూర్వకవుల శైలి ననుకరించు పద్యముల గనుగొనుట యంత కష్టము కాదు కేవల హృద్గతాభిప్రాయోద్బోధకములగు గద్య పద్య రచనలను భావకవితయని నాగరిక లోక ముపలక్షించుచున్నది. భావ మనోహరములగు పద్యము లీ ప్రబంధమున తరచుగా నచ్చటచట గాన్పించుచుండును ఇందలి వర్ణనములు వినిర్మల భావోద్గతాభిప్రాయాభిరామములై సహజములై చదువు చదువరుల కానంద దాయకములై యున్నవి. కొన్ని ఘట్టములు మనోహరములగు ఉపమా, అర్థాంతరన్యాసోత్ప్రేక్షాలంకార లక్షణ లక్షితములై యలరారుచున్నవి. ఈ రీతిన్మనోహరములగు అలంకారములతోను కించిన్న్యూనాధికంబులగు ద్వావింశల్లక్షణ లక్షిత వర్ణనములతోను మిగుల నానందకరముగా నీ ప్రబంధ మున్నదను టొక అతిశయోక్తి కానేరదు. ప్రస్తుత కవులలో ననేకులు నవలా నాటక రచనలయందే తమ వాఙ్మయమును వినియోగించు చుండిరి. ఈ కవిమాత్రము తన శేముషీ విశేషము నా త్రోవలం బోనీక, పద్యముల నడకలచేతను, లలిత పదవిన్యాసములచేతను, "ధాతా యథాపూర్వ మకల్పయత్" శ్రు॥ అన్నట్లు సంస్కృత పౌరాణిక గాథల నున్న దున్నట్లు రచించిన ఆధునిక కవుల స్వల్పకథానికముల నొడగా గొని "వెంట్రుకం బట్టి కొండ నెక్కుట" యను సామాజిక వచన సరణి నతి విపులతమముగా ద్రాక్షాపాక సమ్మిళితముగా నీ ప్రబంధ

రచన మొనర్చి ఆంధ్ర మాతామతల్లి కొక నూత్నాభరణ మర్పించి మాతృ ఋణ విముక్తుండయ్యె. ఈతడిట్టి ఆంధ్రవాఙ్మయమున నింకా కొన్ని ప్రబంధముల రచించి శ్రీనివాసు కృపకు పాత్రుడగుగాత యనుచు "ఈ ప్రబంధమునందలి గుణదోషముల నింకా విమర్శనమునం దిడిన గ్రంధము విస్తృతం బగు నను భీతితో చదువరులకే తద్విచారమున్వదలి" ఈ పీఠికయం దమరు నొసగుల దిద్దికొన బండితాఖండలుల వేడికొనుచు నింతటితో వా లేఖినిని విరమించెదను

ఇట్లు సాధుజన శ్రేయోభిలాషి

ఎలం బజారు,
వరంగల్.

శ్రీమాన్ "ఉభయ భాషాప్రవీణ"
తంయ్యాల సింగరాచార్యులువారు.

# తొలిపలుకు

అభినవ రూపశేఖరులారా!

ప్రస్తుత మీ లోకములో మా జాతీయులు మేరువారనియు చిప్పె (సింపి) వారనియు రెండువిధంబులుంగా పిలువబడుచున్నారు. ఇందుకు హేతువు భృగుతనయుడగు విధాత మేరుకుమార్తె యగు నియతిని వివాహము చేసుకొని ప్రాణుడను కుమారుని గనియె ఆతనికి ద్యుతిమంతుడు, ద్యుతిమంతునికి ఉన్నత స్వనవాతులను కవలుదయించిరి. అందు స్వనవాతునకు నాగరీకుడు జన్మించె. నాగరీకునికి ఛండిక యను కుమార్తె కలిగెను. ఆమె యందు శంకరుని వరమాహాత్మ్యమున జషగిరి శంకరదాసమయ్య యను కుమారు డుద్భవించెను. ముఖ్యముగా నీతడే మా జాతీయులచే మూలపురుషుడుగా నెన్నుకొనబడుచున్నాడు. ఇమ్మహాపురుషునకు అంబికయను నొక కుమార్తెయు, కొందరు కుమారులు నుదయించిరి. అందు అంబికను నరుసోజి యను క్షత్రియుడు పెంచుకొని కృష్ణాజి యను నాతని కిచ్చె. నామె యందు సంతాజి మాండ్యాజి దేవ్రజి యనువారు కలిగిరి. అందులో సంతాజికి పాండురంగడు, జ్ఞానదేవు జన్మించిరి. పాండురంగనికి లింబాజి బావాజి భగవంతు సకోజి యను వా రుద్భవించిరి. సకోజికి దామాజికలిగె. దామాజికి పాండురంగని వరప్రభావమున ముక్యపుచిప్పె యందు నామదేవుడను కుమారుడు లభించె. ఈతనికి వంశకర్తలగు కొందరు కుమారులు, నొక కుమార్తెయుం బుట్టిరి. ఇది మా వంశీయుల వృత్తాంతము. ఇందు విధాత మేరుగిరి నాశ్రయించి నివాస మేర్పరుకొనుటచేత మేరువారనియు, చిప్పెయం దుద్భవిం

చిన వామదేవు సంబంధీయు లగుటచే చిప్పె (సింపి) వారనియు పిలువబడు చున్నా రనుటకు సందేహము లేదు. శంకరదాసమయ్య సంతానీకులును అంబికా (కృష్ణాజి) సంతానీకులును వీరు వారననుండ నెల్లవారును వారి వారి గృహములలో జరుగు వివాహములందు నాకబలి దివసమున మూలపురుషుండగు శంకరదాసమయ్య ఆరాధన జరుపుచు తమకృతజ్ఞతను తెలుపుచున్నారు. ఈలాటి అగాధమగు మేరువంశీయ గాధను బ్రహ్మాండ పురాణము. బసవ పురాణము, భాగవతము, భక్తవిజయము మొదలగు గ్రంథములవల్ల తెలిసికొని తగు పరికరములచే సప్రమాణముగా నాసాధ్యమైనంతవరకు నేలోపము లేకుండా ఈ ప్రబంధమును రచియించి పూర్తియొనరించితిని. ఇదివరలో నేను రెండుమూడు గ్రంధముల రచించినను బ్రబంధ రచనమున కిదియే తొలి ప్రయత్నమగుటచే దీనియందు ప్రమాదము లుండునను భీతిచే నీ గ్రంథమును పండిత కవినాధ యని బిరుదొందె నిరోష్ఠ్యాది లక్షణ లక్షితములగు గ్రంథముల నెన్నో రచించిన శ్రీమాన్ నల్లంతిఘళ్ చక్రవర్తుల తంయ్యాల లక్ష్మీనృసింహాచార్యులవారి కొసంగి సంతనే వారు నాయం దెంతో ప్రేమజూపి యనతి కాలములోనే పరిశోధించి శుద్ధప్రతిని నా కొసంగిరి వారికి నా కృతజ్ఞత తెలుపుకొరకై యేమొసగిన చాలదనుకొని "చందురునికి నూలు పోగన్న" రీతి నీ క్రింది పద్యముల జంటను కానుకగా నొసంగు చున్నాను.

ఉ॥ మేరుకులాభి జాత్యము న ♦ మేయపురాణముగా రచించి యీ
భారము మీ యధీనమన ♦ భారముసేయక సంస్కరించియున్
ధీరత గాంచు యీ కవి ను ♦ ధీమణి నెన్న తరంబె వారి కిం
పార కృతజ్ఞభావమును ♦ బాల్పడ నుత్పలమాల నిచ్చితిన్.

చ॥ ఉపకృతి నిచ్చి సత్కృతిని ♦ నుజ్వలితంబుగ జేయ వారి ప్ర
త్యుపకృతి నెట్లుజేయు దని ♦ నూహలచే సరిగాంచలేక ప్రా
క్తపము ఫలించెనో విధివి ♦ ధానముగా సవరింపుటల్ మదీ
య ఫలముగా నమస్సిడె ద ♦ హర్నిశ చంపకమాల నిచ్చియున్.

మరియు ప్రబంధము గాంచి సంతసించి తెమ యవ్యాజ ప్రేమతో తమ యభిప్రాయముల నొసంగిన విపశ్చిద్వ్యాసవుల క నేక నమస్కృతుల నర్పించుచు నిందలి గుణదోషంబుల విమర్శించు భారము నీర క్షీర విభాగమున సమర్థు లగు రాజహంసల రీతి వెలుంగుచున్న పండితావళి యందు నుంచిన నాసాహసమును మన్నింతు రని కోరుచున్నాను. ఇట్లు గ్రంథకర్త.

ఓం

# విషయసూచిక.

## ప్రథమాశ్వాసము.

## ద్వితీయాశ్వాసము.

## తృతీయాశ్వాసము.

## తప్పొప్పుల పట్టిక.

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు | పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 6 | 9 | మేగుశెంశ | మేరువంశ | 62 | 5 | వాక్యపుల | వాక్యముల |
| 19 | 15 | తారకల సరి | తారకల సరి | 70 | 10 | గలటుంచని | గలడంచని |
| 25 | 12 | వీతర | వీరత | 75 | 3 | యువతీనం | యువతీజనం |
| 28 | 21 | బురగగళం | బురగళమం | 75 | 10 | బరముగ | బిరముగ |
| | | బుగాదుర | దు నున్నది | 109 | 9 | కోపము | క్రోశము |
| | 15 | బయల్లు | బయళ్లు | 110 | 1 | సమ్మతు | సన్నుతు |
| 55 | 5 | జాన | జ్ఞాన | | | | |

అష్టాక్షరి మంత్రోపాసకుడు



వాడపల్లి పాపయ్యాఖ్య రాజయోగిగారు

( గ్రంథకర్త తండ్రిగారు )

శ్రీమత్ శివరామదీక్షిత అచలగురు పీఠాధిప



గ్రంథకర్త:

పూర్ణానంద వాడపల్లి ఆగయార్య రాజయోగి

మట్టెవాడ :: గొల్లబస్తి :: వరంగల్.



శ్రీ వేంకటేశ్వరాయ నమః

# మేరువంశ పురాణము

## ప్రథమాశ్వాసము

* ౧ ఇష్టదేవతా ప్రార్థన. *

రమణీమణీహృదయ ♦ సీమ దవార్చన వీడకుండుచే
కారణమై తదన్యముల ♦ గానదు, నట్టులనే మదీయ హృ
త్సారసమందు ఘోరకుర ♦ తంబుల బోవగ సేయునీపదాం
భోరుహముల్ దలంతు పరి ♦ పూర్ణకథారచనాప్తికై హరీ.

ఉ॥ చంచలమంటు నీహృదయ ♦ సారసమెప్పుడు, దుర్మదాంధు లే
లంచమునిచ్చువారొ? బహు ♦ లక్షణయుక్తత వారి సద్మముల్
కొంచముగాని వీడవదె! ♦ కోపమొ? పండితపక్షమందు నా
పంచను నిల్వ వేడెదను ♦ భావము నిల్కడ జేసి భార్గవీ ౨

చ॥ గిరిజకు నర్ధభాగమును, ♦ కేశసమూహము గంగపాలు, సుం
దరముఖ మగ్నిభాగము, సు ♦ ధాకరభాగము శీర్షమెన్నగా
నురగముపాలు కంఠము, న♦హో! చరణంబులు భక్తభాగమా
ట రహిం గిరీశ! గ్రంథము వి ♦ డంబనగా నివకంచు వేడెదన్ 3

గీ॥ ఆదిశక్తివి నీవని ♦ యఖిలజనులు
సర్వకాలములందున ♦ సన్నుతింతు
రంబ! ప్రార్థింతు గ్రంథాది ♦ నఖిలదోష
శాంతి జేయుమటంచని ♦ సంతతంబు ౪

చ॥ పలువిధ జంతుజాలముల ♦ భావిఫలానుభవానురీతిగా
కలిమిని లేములన్ నుదుట ♦ ఖండితబుద్ధిని వ్రాయుచుండి యా
కలిమి నెలంత నాయకుని ♦ కారణుడంచు స్మరించుచున్న నా
నలువ దలంచెదన్ మదిని ♦ నాదు కవిత్వరసప్రవృద్ధికై, ౫

ఉ॥ చల్లని చూపుగల్గి జల ♦ జప్రభహస్తము వీణమీటనా
మెల్లని తంతు శబ్దముల ♦ మేరువునైన జలింపజేయు నా
పల్లవపాణి ధాతృసతి ♦ భారతి నాదు కవిత్వధారయం
దల్లిక శబ్దపాటవము ♦ లాదరబుద్ధితో నిచ్చి గావుతన్. ౬

చ॥ తనువును జూడ వామనము ♦ దంతము నొక్కటి మోము జూడగా
ఘనమగు నేన్గుతొండము, వి ♦ కాసముఖంబొక హస్తమున్ గజా
నన చెలువొందగా, కలజ ♦ నంబులు నిన్ను దలంతు గట్టి నా
కనువగు నల్లు గ్రంథమున ♦ వాభ్యుదయంబును సేయ నెంచెదన్

గీ॥ మొదట నష్టాక్షరీమంత్ర ♦ బోధ జేసి
నట్టి పరవస్తు పాదయా ♦ చార్యు నెపుడు
సారతర ఘనకవితాకు ♦ మారినడక
విఘ్నములు లేక నడుపింప ♦ వేడుచుందు. ౭

ఉ॥ సకలమతంబు లన్నిటిని ♦ జక్కగజూచియు పూర్ణబోధయే
యకలుషమంచు మాధ్వుల ♦ నందరిపాపములెల్ల ద్రోసిము
క్తికి సరిమార్గదర్శులగు ♦ కేవల భావుకు నేటి వంశ మూ
ర్తికమగు వేంకటేశ్వర సు ♦ ధీమణినెన్నెద నిష్టసిద్ధికై. ౯

* ౨ సుకవిస్తుతి *

గీ॥ ఘనుడు భవభూతి దండిని ♦ గాళిదాసు
భాణుగవి భోజుమాఘుని ♦ భారవిని ము
రారినెంచెద సంస్కృతా ♦ నంత కవుల
కీర్తి స్మరియింతు మద్గ్రంథ ♦ పూర్తికొఱకు. ౧౦

చ॥ ఘన కవితాంధ్రకావ్యముల ♦ కల్పనజేసిన తిక్కయజ్వ పె
ద్దన కవి రామకృష్ణ వసు ♦ధాధిపచంద్రుని కృష్ణరాయ నె
ర్రనను మహాత్ము నన్నయ తె♦లుంగుల నెంచుచు నెల్లవేళ పో
తనను మనస్సరోజమున ♦ దప్పక నెంచెద గ్రంథపూర్తికై.

* ౩ కుకవినింద. *

గీ॥ ప్రాసలక్షణ శూన్యమౌ ♦ భావ కవిత
మల్లుచుందురు పూర్వుల ♦ ననుసరింప
నట్టి కవులను దలచిన ♦ నఘముసూవె
ఖరము నశ్వముతో సరి ♦ గాన నగునె? ౧౨

వ. అని యిట్లు యిష్టదేవతా ప్రార్థనంబును, సుకవివందనంబును,
గుకవి తిరస్కారంబును గావించి మత్కృత్యుదయకారణం
బెట్టిదనిన ౧౩

* ౮ - కవివంశావళి. *

సీ॥ కౌండిన్య ఋషిగోత్రి ♦ కమలాంబు నిధికిఁ
బరిపూర్ణ చంద్రుఁడు ♦ పావనుండు
దైవభక్తియుతుండు ♦ దాన ధర్మ రతుండు
ధర వేంకటేశ పి ♦ తామహుండు
తద్ధర్మపత్నియా ♦ ధర రామలక్ష్మమ్మయుం
దఖిల సద్గుణవంతు ♦ డమలచరితు
డైన పాపయనాము ♦ డంబుజోదరు పాద
నళినాళి రూపుడు ♦ నాదుతండ్రి
గీ॥ ఔర కనకాంబతల్లి నా ♦ దోరుగల్లు
నందు మట్టెవాడ నివాస ♦ మై చెలంగు
ఆగయాభిఖ్యచేత న ♦ న్నవనిజనులు
పిల్చుచుందురు సర్వత్ర ♦ ప్రీతితోడ.

* ౯ గ్రంథకారణము. *

ఉ॥ నేనొకనాటి వేకువను ♦ నిద్దురపిడి మహాత్ములందరిన్
మానసమందునన్ దలచి ♦ మానకస్వప్నమె మెల్కదప్పినన్
ప్రాణిక మద్గురుండు పరి ♦ పూర్ణదయారస ముప్పతిల్ల నా
మేనుస్పృశించియిట్టులని ♦ మెల్లనబల్కె మృదూక్తియుక్తిగన్

వ. వత్సా! మచ్ఛిష్యమండలిలో ప్రధానుడ వీవయనుట నీ
తేని సంతసించితిని. అందు మిక్కిలి యచలసాంప్రదాయా
నుసారముగా రెండు గ్రంథముల రచియించి తస్మతాచా

ష్యుల కంకిత మొనర్చితిని. ప్రస్తుతము నీ జాతీయ వ్యాపార మర్మ కర్మ ధర్మ ప్రముఖంబులు గలుగ, మేరువంశ పురాణంబును నామాంకంబుగా నొక ప్రబంధంబు రచియించి లోకోపకారము జేయుమని, తద్గ్రంథరచనా విధానంబు కథాక్రమంబంతయు సెలవిచ్చి పరవస్తు భట్టరుగారుండు కన్నొరంగిన లేచి వల్లేయుచు యగ్గురుశిఖామణికి నమస్కరించి వందారు జనమందారుండును, నిఖిల ముని గణ హృదయకమల సూర్యుండును, శ్రీమదలర్మేల్మంగానయన చకోర చంద్రుండును, మద్వంశ దైవంబును, సకల కలికల్మష పరిహార కథాక్రమణంబుగల శ్రీవేంకటేశ్వరస్వామి కంకితం బొనర్చెదనని యుల్లంబున తలంపు సేయు చెట్టవిన ౧౬

* ౬ షష్ఠ్యంతములు. *

క॥ శ్రీతరుణీ కుచయుగళ
స్థితాగురు చందన విర ♦ చిత వక్షునకున్
నేతకు స్వాశ్రిత మానవ
చేతానందునకు దైవ ♦ చింతామణికిన్. ౧౭

క॥ సంకట హరునకు మామక
శంకసమూహాగ్నినాశ ♦ జలదాకృతికిన్
వేంకట నాయకునకు స్వా
లంకార శరీరునకు మ ♦ లానఖ్యునకున్. ౧౮

క॥ దోషమహాపద మారుత
వేషునకుఁ సర్వశాస్త్ర ♦ వేదిత ఘృణికిఁ
తోషిత హృత్కమలజునకు
భూషిత శాంతాది సుగుణ ♦ పుణ్యున కెలమిఁ. ౯

క॥ ఇంగిత గుణునకు ఘన స
త్సంగునకుఁ శమదమ ప్ర ♦ ధాన హితునకుఁ
మంగళ మందిర మహిళా
పుంగవునకు వేంకటేశ ♦ భూనాథునకుఁ. ౧౦

వ. సమర్పితంబుగా నా యొనర్పం బూనిన మేరువంశ పురాణంబను మహాప్రబంధంబునకు కథావిధానం బెట్టులనిన

* ౨ కథా ప్రారంభము. *

ఉ॥ పుణ్యకథాశ్రయంబును త♦ పోధనమండల పండితాది సా
ద్గుణ్యము సర్వకాల నవ ♦ కోమలపల్లవితప్రవల్లికా
గణ్యము సర్వజీవ సుఖ ♦ కారణభూతము నైన నైమిశా
రణ్యము శౌనకాదిముని♦ రాణ్ణివాసము నై చెలంగెడుఁ

ఉ॥ అందొకనాఁడు సత్కథల♦నన్నియుఁ జెప్పెడు సూతమౌనికిన్
వందన మాచరించి తమ ♦పాపము లెల్ల నశించునంచుఁ దా
మందరు బల్కి వేరొకటి ♦ నానతినిండని మేరువంశ సం
బంధము విందు మంచనిన♦బల్కె మునీశుఁడు మోదమందుచున్

గీ॥ మీరు నన్నడిగినట్టుల ♦ మేయగుణుఁడు
శుకమహర్షి బరీక్షిద్వ ♦ సుందరాధి

నాథుడడిగిన మేరుప ♦ న్యాయకథాప్తి
వినగ దెలిపెద నది మీకు ♦ విస్తరింతు. ౩౮

* శ్రీ భృగుమహర్షి ఆశ్రమ వర్ణనము. *

ఉ॥ వైశ్రవణోన్నతిన్ విడచి ♦ పావనులైన తపోధనాఢ్యులా
యాశ్రమ కార్యభారముల♦నందములర్పగ జేయుచుందురిం
కేశ్రమ లేక ప్రాణులున ♦ హీనత మిత్రతతో జరించు నా
యాశ్రమ మొప్పెడున్భృగుమ♦హర్షి నివాసముగాగ భూస్థలిన్

సీ॥ ఏనుగు సింహంబు ♦ లెప్పుడు జూచిన
సయ్యాటలాడు వి ♦ శాలభూమి
శరభ సింహంబులు ♦ సఖుల పోలికనుండి
వన విహారము జేయు ♦ గనికరముగ
గండభేరుండముల్ ♦ గనుగొని ప్రేమతో
శరభ సంతానమున్ ♦ సాకుచుండు
శార్దూల మృగములు ♦ జంటగా దిరుగుచు
నానంద మొందు న ♦ య్యాశ్రమమున

గీ॥ సూర్య కిరణంబులెల్లను ♦ సోకకుండ
గగనభాగంబు నంతయు ♦ గ్రమ్ముకొను కి
సలయ జాలకుసుమ ఫల ♦ సహిత వృక్ష
తతులచే నొప్పు మాని య ♦ థాప ౩౯

వ. అది మఱియును విశాలానేక బాలరసాల పల్లవభక్షణా
మృదుమధుర కోకిలాలాపంబును, కోరకిత కుసుమితా

నంత లతానికుంజ మంజులంబును, అనంతోద్భవ పరి
భ్రమిత హోమధూమాచ్ఛాదిత సూర్యకిరణ తమోవృ
తంబును, సకలోదాత్తానుదాత్త స్వరితత్రయ భేదా
న్విత వేదపాఠకాదాగత సుశబ్ద సంయుతంబై యొప్పు నా
య్యాశ్రమంబున సకలమునిగణ శ్రేష్ఠుండనగు భృగు
మహర్షిచంద్రుడు నివసింపుచుండు ౨౭

ఉ॥ ఆతని పుత్రులన్ గనిన ◆ నాతనికే సరియాగా రెండునన్
ధాత విధాతలంచు ఘన ◆ తాపసవర్యులు యౌవనంబునన్
భూతలమన్మథుల్సుగుణ ◆ పూర్ణులు శాస్త్రములందు జీవులున్
నేతలు ధర్మమార్గముల ◆ నే తలపుంతురు సార్వకాలముల్

{ ౯ భృగుతనయులగు ధాత విధాతలు మేరుపర్వతమునకుంబోయి
తచ్చిత్రములం గనుట. }

ఉ॥ వారొకనాడు వేడుకను ◆ పరమ తేమియు లేకనుంటచే
మేరువు జూడగాదలచి ◆ మిత్రులగూడియు సౌఖ్యస్ఫూర్తి సం
చారము జేయగా మిగుల ◆ చక్కని కామిదేయటంచు నిం
పారగతంద్రియాజ్ఞగొని ◆ యందరుబోయిరి పోయి ముంగిటన్

ఉ॥ జూచిరి కిన్నరాదిగణ ◆ శోభితశృంగ సమూహ చంద్రకాం
త చయరత్న సంయుతము ◆ తాపసవర్య మహాశ్రయంబునా
మేచకమేఘవర్గ పరి ◆ మేయము, సర్వమృగాశ్రయంబు స్వ
ర్ణాచల రత్నమున్ ధరచ ◆ రాచరవాసము జెల్వమిల్లునన్.

క॥ నిస్తుల తేజాన్వితమున
భస్థలినిన్ ముట్టు శిఖర ◆ భాగంబులతో

కేసరి సర్వజనావన
పుష్కరి వృత్తాద్రి వహాళి ♦ శోభిత నగముం.

మ॥ కనియెంతేనియు సంతసంబున నగా ♦ గ్రంబెక్కి తద్దివ్యలన్
మనసుంబొంద స్పృహ్యాజ్జావఫలతో ♦ మాక్ష్మాదుచుగ్దక్షిణాం
బున నిర్వాంకల జాతివృక్షముల నం ♦ భోజాతసంయుక్త వా
హిని జంబూనదిగాంచి తజ్జలరసా ♦ హిక్ చిత్రముల్ జూడగా

వ. వెంటనే హేమాద్రినుండి యవరోహణంబు గావించి త
త్ప్రాంతోపవనంబు బ్రవేశింప నయ్యాది భారతీపికాగా
నంబునుంబోలె వివిధ శృంగారయుత కలకలనిస్వనయుతం
బై, విధాతసృష్టివలె సర్వజీవనిచయంబై, సత్యలోకంబు
మాడ్కి భారతీసర్వతోముఖంబై, యత్యంతానంద సంధా
యకంబై యలరారు నవ్వనచిత్రంబులగాంచుచు నచ్చటి
కనతి దూరంబున నదీ జలనాట్యరంగంబున జలక్రీడసలుపు
వాంఛను కొందరు వరారోహలు తత్సమీపవృక్షచ్ఛా
యల దమచేలాంచలముల వీడి జలముల బ్రవేశించి 33

* ౧౦ మేరుపుత్రికలగు అయతి నియతులు జలక్రీడలాడుట. *

చ॥ తరగలనూగు పద్మముల ♦ దానుగనుంగొని కోపవృత్తి ని
వెరుగవె యేమి జేయుదువె ♦ వే మిడిగర్వమటంచుబుక్కిటన్
దొంకొని నీరుజిమ్ము నొక ♦ తో యరుహాక్షియి దేమటంచు యొ
క్కతె తమ దేభయానయువి ♦ కావికనవ్వ విలాసమొప్పగన్

చ॥ నలుగురు నాల్గువైపుల వి ♦ నందితవృత్తిని నీరుజిమ్మతా
వెలికిలబండి యీదుచున ♦ పీనపయోధర వృత్తి బూనినా

ప్మలను మునింగి లేచుతరి ♦ ముంగురులెల్లనువీడి బర్వనె
మ్ములుపురివిప్పియాడె జల♦ ముక్కని సంతసమందియుత్తరిన్

ఉ॥ చూడవె నీవటంచయుతి ♦ సుందరినొక్కతెబిల్వ నీవు నా
జోడువుగాదటంచు తన♦చూడ్కిమరల్చిన నొక్కభామయేఁ
జేడును జోడుగాగొనిన ♦ జేయుటదెల్పవె మాకటంచు నా
కూడిమికాండ్రమాటలకు ♦ గోపమువచ్చిన నవ్విరందరున్

క॥ కొట్లాడుచు నంగములన్
జిట్లింపుచు నీరునంత ♦ జీకాకుగ నా
కిట్లని యట్లని గులుకుచు
మాట్లాడుచు నాడిరందు ♦ మగువలు వరుసన్. 32

గీ॥ ఇట్లు గ్రీడించి మగువలు ♦ నింపుమీఱ
నొడ్డునకువచ్చి చీరల ♦ నొకరికొకరు
గట్టి మగవారిజాడల ♦ గుట్టుదెలసి
పయనమాటకు యత్నంబు ♦ బన్నిరంత. 33

{ ౧౧ అయాతి నియుతులను చూచి మోహించి ధాతవిధాత
లన్యోన్య పరిచయంబులు గావించుకొనుట. }

గీ॥ వారి పయనంబుజూచియు ♦ మారబాణ
తాడితాత్ములునైన వి ♦ ధాత ధాత
లచ్చటికివచ్చి వారితో ♦ ననిరి యిట్లు
వీరలెవ్వరు తెలుపగ ♦ లారె యనిన. 34

ఉ॥ నీటగువారిప్రశ్నకు వ ♦ నేరుహనేత్రిల తోటిబాలికల్
పాటవమొప్పబల్కిరి శు ♦ భప్రదరూపులు మీరలెవ్వరో

తేటపడంగ దెల్పుడన ♦ దెల్పిరి ధాతవిధాతలందు్ర మా
కూటము భార్గవాశ్రమము ♦ కోర్కై భృగుడాద్వహాలు దెన్న
దండ్రియా.

గీ॥ అనుచు దెలిపిన బాలిక ♦ లవిరి వీరి
నయతి నియతియు ననుచుండు ♦ రాత్మహితులు
మేరుదేవియు మేరువు ♦ మిగుల దల్లి
దండ్రులగుదురు వీరి వృ ♦ త్తాంత మనిన. ౪౧

బాలికలిర్వు రా పురుష ♦ వర్యుల రూపవిలాసభావముల్
మేలిమిగానఁజూచి తమ ♦ మెప్పునుబొందిన సుందరత్వ మీ
బాలకులందు జూచుటకు ♦ పద్మజగర్భుని మెచ్చుకొంచు నా
వేళనె జన్మ ధన్యమని ♦ వింతగజూచిరి వారినిద్దరి౯. ౪౨

అంతట నయ్యువతీ యువకుల మనోఫలకమున నన్యోన్య దర్శనంబున రూపంబులు ముద్రితంబైనంతనే తోటి బాలికలతో గృహంబునకు జని తమ దండ్రియగు మేరువునకు జరిగిన వృత్తాంతంబు నివేదించి వారిని దమ భర్తల జేయుమని వేడుటయు నతడా బాలికల యభిమత మీడేర్ప సంకల్పించి .

క॥ ధాత విధాతల బిలచియు
నా తరతరములకు బావ ♦ నము, నానా సం
భూత మహాఘవిధూనన
హేతువు మత్సుతల నుద్వ ♦ హించిన మీరల్. ౪౩

అని ప్రార్థించిన వల్లెయంచు మదిలో ♦ నానందము పొంగగా
మునుమాతాపితృ వాజ్ఞ గైకొనియును ♦ న్మోదంబుగా నత్తుమం
చనితా తండ్రికి మేరు వాక్యముల బ్ర ♦ హ్మానందమింపార గా
దరయుల్ జెప్పిన నాలకించి మరి ను ♦ ద్వాహంబు కై పంపినన్

* ౧౨ ధాత విధాతల వివాహము. *

క॥ వారుబోయిన వెనుకను ♦ భద్రమయిన
లగ్నమును జూచి ధాతకు ♦ లలనయైన
అయతి నిచ్చి విధాతకు ♦ నియతినొసగి
పెండ్లిని జేసె గొప్పగు ♦ విందుతోడ. ౪౬

క॥ పెండ్లైన నంత దంపతుల్ ♦ ప్రియమెలర్ప
భార్యకును భర్త, భర్తకు ♦ భార్యముదము
గలుగ నింటికి జేరిరి ♦ కనికరమున
కూతురుల బంపి తాను సం ♦ కోచముడిగె. ౪౭

తే॥ ఇటు సతీపతు లిద్దరు ♦ నింపుగాను
సౌఖ్యవృత్తిని నుండిరి ♦ జగతియందు
రోహిణీరాజుపోలిక ♦ రూపు తేజ
లలర మన్మథరాజ్య సిం ♦ హాసనమున. ౪౮

ఇట్లు కొంతకాలంబు వివిధ సౌఖ్య తరంగిత డోలాంతర స్థితానందాబ్ధి నోలలాడి యున్నంత. ౪౯

* ౧౩ గర్భిణీ స్త్రీ వర్ణనము. *

క॥ అన్నము రుచియింపదు సం
పన్నని గృహమందు బుట్టి ♦ బహుభంగుల దా

మున్నది కావలెనని హా
రెన్నన్కో కోరుచుండి ♦ రెలనాగలోగిఁ. ౯౦

చ॥ అరుమలునెక్కువాయెను,స్త ♦ నాగ్రములెల్లనునల్లనయ్యె రా
తురులను నిద్రలేమికిని ♦ తో యుకుహాక్షుల మోము శ్వేతమై
పరగె, దదీయగర్భములు ♦ భారములయ్యెను,నోష్ఠబింబమం
దరయగరక్తశూన్యతయు ♦ మారె!బయల్పడెచానలంమునఁ

క॥ దినదినము గడచుచుండిన
మనమున కోరికలుగల్గె ♦ మానవతుల కిం
పున గర్భముహెచ్చెను వా
వనరుహ నేత్రలకు నెలలు ♦ వరుసగనిండెఁ. ౯౧

వ. అంత మేరువు తన పుత్రికలాసన్నసత్వలగుట విని యెంత
యో యుల్లంబున సంతసిల్లి తొలిచూలగుట నల్లుండ్రతో
గూడ బిడ్డలను స్వగృహంబునకుదోడ్కొనివచ్చినకొన్ని
దినంబులకు ౯౨

* ౧౪ మృకండ ప్రాణుల జననము *

ఉ॥ గురుడును తొమ్మిదింటను భృ ♦ గుస్థితి కేంద్రములంకరింప నిం
పరయగలాభసప్తమముల ♦ లందుకుజుండుబుధుండునుండయుం
బరమని చంద్రులుచ్చను శు ♦ భప్రదమై వెలుగొందబుట్టెవా
సరసిజనేత్ర గర్భమున ♦ చక్కసిపండు మృకండుడయ్యెడఁ

గీ॥ నియతి గర్భంబునందున ♦ నయవిదుండు
లక్షణోపేతు డధికబ ♦ లాన్వితుండు

బ్రాణుడను బాలుడుదయించె ♦ భాసురముగ
భువి నరుంధతికిని శక్తి ♦ బుట్టినట్లు. ౫౫

వ. అంత ధాతవిధాతలు నబ్బాలకులను గాంచి మోదంబున కర్మకలాపంబుల నిర్వర్తించుకొనిన పిమ్మట విధాత ప్రకృతిసౌందర్యంబులంగల ప్రేమచే మేరుగిరి దరియం దొక యాశ్రమంబునిర్మించుకొని పత్నీపుత్రసహితంబుగా సుఖంబున కాలంబు గడుపుచుండ, ధాతయు సతీసుతుల దోడ్కొని నిజాశ్రమమున కేతెంచిన కొన్నినాళ్లకు మృకండునకు గర్భాష్టమవర్షంబు బ్రవేశింప నుపనయనాది కర్మలజేసి మనస్విని(మరుద్వతి)యను కన్యకను వివాహంబు గావింప నప్పరమసాధ్వియం దఖిలజనవంద్యుండును, ఈశ్వరవరప్రసాదలబ్ధుడగు మార్కండేయ మహర్షి జన్మించె నన బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె ౫౬

గీ॥ ఖండపరశుని సేవి మృ ♦ కండు పుత్త్రు
చరిత మీవరకే వింటి ♦ సంయమీంద్ర
ప్రాణు చరితంబు వినుటకు ♦ భావమందు
కోరికయుబుట్టె వినుపింపు ♦ ధీరచరిత. ౫౭

వ. అనుటయు శుకయోగీంద్రుం డిట్లనియె ౫౮

* ౧౫ శిశిర ఋతువు వర్ణనము. *

గీ॥ గంధవహుగూడి పుష్పసు ♦ గంధములను
శీతలమువీడి కాలంబు ♦ శిశిర ఋతువు

అనుసరించియు నేతెంచ ♦ నాదముగను
ఖారసాలకు వచ్చిన ♦ బంధువనగ. గీ:

సీ॥ పవలు రాత్రియు సమవృత్తి ♦ పటిమదాల్చె
వృక్షజాతియు వృద్ధత్వ ♦ వృత్తి వీడి
నూతనముగానజొచ్చె నీ ♦ భూతలమున
ధరను కట్నాలుగట్టు శి ♦ థంబుసూవె. ౬(

వ. ఇట్లు శిశిరఋతువు ప్రవేశించుటయు ౬(

* ౧౬ పాణిని చరిత్ర. *

చ॥ తలిపమునన్ బరుండియుయ ♦ థామతి శైశవలీలసల్పుచున్
బలుకక తల్లి పైనబడి ♦ బల్మియ థేచ్ఛగ నాటలాడుచున్
తొలినెలమాస పంచకము ♦ తోనొకవత్సరమైనయంతలో
బిలచిన చూచు బోర్లబడు ♦ ప్రేమవలంతులుసంతసించగన్

గీ॥ తల్లిబోధించుమాట లు ♦ దాత్తముగను
"తాత తాత"ని "యత్త"ని ♦ తప్పటడుగు
లిడుచు సాశ్వత్రిమ మందుండు ♦ హితజనముల
మదికి ప్రాణుడానర్చె స ♦ మ్మతిముదమును. ౬

సీ॥ ఇట్లు తొనిమిదివత్సరా ♦ లింపుమీర
గడువ వ్రతబంధనంబను ♦ కర్మజరిపి
గురుకుల నివాసమునుజేయ ♦ కొడుకునపుడు
బంపె మెట్టింటికేగెడు ♦ భామువలె. ౬౹

గీ॥ అంత బ్రాణుండు గురు వసి ♦ ష్టాశ్రమమును
జేరగాబోయి బాలుర ♦ తో రహించి
పాఠములుజెప్ప బఠియించి ♦ పాటిదెలిసి
గురుని మెప్పించె విద్యలో ♦ గూర్మిగలుగ. ౮౧

ప్రాణునియందుయౌవనము ♦ భాసిలజొచ్చెను నాగుమీసముల్
పూనికనంగ సౌష్టవము ♦ భూరుహశాఖల బోలు హస్తముల్
మానిత రోమరాజి జిత ♦ మన్మథరూపము నెంచిచూడ శ్రీ
వాణిచెలంగె సర్వమును ♦ వర్ధిలెశాస్త్రములుక్ బఠింపగిక్

వ. ఇట్లు దినదిన ప్రవర్ధమానంబై నవీన యౌవనంబు ప్రవే
శింప బ్రాహ్మణుండు వేదశాస్త్రాభ్యాసంబులు పదలకి
జేయుచుండుతరి నతిసుకుమారగాత్రియు నేత్రజిత పుండ
రీకయునగు వసిష్ఠ పుత్రికయగు పుండరీక యనన్య సా
మాన్య రూపలావణ్య విరాజిత దేహయై ప్రాణునితో బాటు
విద్యాభ్యాసంబు జేయుచు దినదినాతిక్రమంబుగా సర్వ
విద్యాపారంగతురాలగుటయు ౮౨

* ౧౨ పుండరీక వర్ణనము. *

ఉ॥ అంతటబుండరీకయు న ♦ నాంతిగసీమల తోటిబాలికల్
వింతగు క్రీడలాడుచును ♦ వీనులకింపగు పాటబాడుచున్
మంతెనమాడుచున్ గసుమ ♦ మంజరులల్లుచు జెట్లనీడ ర
వ్వంతయు శంకలేక నవ ♦ పల్లవకోమల దేహలొప్పగన్.

సీ॥ జాణయొకరుక ♦ చామంతి పూలతో
జడలల్లు విధమును ♦ సరిగజూపు

ప్రథమాశ్వాసము.

సఖియ యొకర్తుక ♦ జారెడు కోకల
సవరించు విధమును ♦ సరిగ నొ క
ముగుదయొకర్తుక ♦ పగడాల పేరుల
గ్రుచ్చువిధంబును ♦ నచ్చజెప్ప
బాలికయొక్కర్త ♦ భయభక్తితో వచ్చి
పాదపపోషణ ♦ పథము దెల్ప

సీ॥ ఇట్లు చెలులందరా బాల ♦ కింపుమీర
బనుల నేర్పుచు నాడుచు ♦ భావికాల
సౌఖ్యజీవిని యగుటకు ♦ సర్వకార్య
నిర్వహణశక్తి గలిగింప ♦ నేర్చిరంత. ౬

క॥ వనితకు యౌవనముండగ
మనమేలట యుండరాదు ♦ మానిని కనగా
ఘనమగు లజ్జయు భయమును
వెనువెంటనె గలిగె హృదయ ♦ వీథులయందున్.

గీ॥ వయసువచ్చిన బాలికా ♦ వయవములకు
చాయ హెచ్చుచునుండె నా ♦ చంద్రవదన
చూడ జూడగ జూచెడు ♦ జూపరులకు
విస్మృతియుగల్గ జేయు వి ♦ వేకమున్న.

గీ॥ పుండరీకను బోల్పనే ♦ పుండరీక
సౌమ్య సౌందర్య మలరును, ♦ చాన దేహ
మునకు విద్యుత్తు సమమన్న ♦ మొనసి చలన
గతిలగించెను, గళము పి ♦ కస్వరంబు.

హంసవితతికి నేరుపు ♦ యానగరిమ
శుకములకు నేర్పుచుండు వ ♦ చోవిలాస
మహహా! స్వరజాతి పికముల ♦ కొసతిచ్చు
తరుణినిం జూడ ధన్యత ♦ తలపనగునె? ౭౩

ఉ॥ పారసగంధివేణిగని ♦ సర్పములే కడు భీతిజెందు శృం
గారముగల్గు కేశముల ♦ కారునుజూచి నెమళ్లు నృత్తమం
దేరుచియించు మేఘమని ♦ దీర్ఘములౌ చమరీమృగావళీ
సారము వాలముల్ గలచి ♦ సన్నుతికెక్కు విలాస వైఖరుల్

చ॥ సకియ ముఖస్వరూపము ప్ర ♦ సంగవశంబున జంద్రుడేగి స
న్మికగ కళాళినిగ్గని న ♦ మోనమయించని యోడిపోయె, ని
న్నక ముకురంబిదెంతయని ♦ నాతినిగాంచి కలంగె, నబ్జమై
హికమనిపోయి వాడె, శుభ♦హీనులు పెద్దల గెల్వశక్యమా?

ఉ॥ మెలనాగ కన్నులు న♦యారె! మదించిన గండుమీనముల్
ప్రాయుగ మెన్న మన్మథుని ♦ పుష్పశరాసన మీసడించెనుం
మాయురె! వాక్కులా శుకస ♦ మంబని నెన్నగజాలు నేలకో
మాయువతిం గనుంగొన మ ♦ హత్త్వది యేమిటో గెల్వలేదిలన్

గీ॥ సఖియ బొమ్మలు సింగిణీ ♦ సాటి పుష్ప
చాపు చాపము కేవంక ♦ సుప్రతించు,
బల్లవమునకు సాటి సు ♦ పాణి మేటి
హస్తయుగమును దంతము ♦ లమరు బోటి. ౭౭

గీ॥ ముగ్ధ కుచములు జూచియు ♦ మోము లేక
సామ్య మొందగ దలచియు ♦ జపము జేయు
చుండు చెట్లెక్కి కొమ్మల ♦ నందు కున్న
ఫలము లేదయ్యె దాడిమ ♦ ఫలములకును. ౭౯

ఉ॥ తుంగరథాంగ సుందరము, తోయజజాలక మార్దవంబు మేల్
బంగరు బొంగరాల మన, పర్వతశృంగ కఠోరకమ్ము, మా
తంగపకుంభవృత్తము, మ♦దంబగు పుష్పగుళుచ్ఛమంజుళం
బంగన చన్నుదోయి పరి ♦ హాస మొనర్చె విలాస హేతువై.

గీ॥ పుండరీక కుచంబుల ♦ పొందు లేని
చెండు లింకేటికంచని ♦ స్త్రీల చేత
నే మెలంగిన బాగని ♦ నిలచిమాడ
దయను శిఖ జేరిచిరి మహా ♦ దారమతిగ. ౮౦

గీ॥ కమలగుచ్ఛములకు సరి ♦ కనులు చనులు
నాగరంభలతో సరి ♦ నడలు తొడలు
బుష్కరము తారకల సరి ♦ ముఖము నఖము
లరయ నళిజలదములు ముం♦గురులు కురులు. ౮౧

గీ॥ ఇన్ని యేటికి జెప్ప నా ♦ యింతి తోడ
సామ్యమును జెప్పగా రాదు ♦ జగతియందు
నామె కుపమాన మెన్నగా ♦ నామెయగును
మన్మథుని చేతి బాణ స ♦ మానముగను. ౮౨

వ. ఇట్లుండ నొక్కనాడు ౮౩

ఉ॥ బాలరసాల దాడిమలు ♦ పంపర నిమ్మలు పొన్నగున్నలున్
సాలములున్ లవంగములు ♦ శారదముల్ గిరిమల్లె మొల్లలున్
మాలతి తీవెలున్ కనక ♦ మల్లికలున్ విరజాజి గుంపులున్
మేలుగ సాదుచుండిరట ♦ మించెడు ప్రేముడి బాలికామణుల్

సీ॥ ఇట్టి సౌందర్యరాశి తా ♦ నేకతమున
పూలమొగ్గల జూచుచు ♦ ప్రొద్దుబుచ్చు
కాలమున ప్రాణు డేగ నా ♦ కాంత యంత
లజ్జ భీతులు గల్గగ ♦ లాలిత మతి. ౮౫

* ౧౭ పుండరీక సాత్రిణుల ప్రేమాంకురము. *

గాంచియుజూడనట్లు తన♦చూడ్కి నిగిడ్చియు మొల్లమొగ్గలన్
గాంచినరీతి జేసెడి న ♦ వోఢను జూచియు ప్రాణుడంత సం
కోచిత చిత్తుడై వనిత ♦ కోమలదేహము ముట్ట నుల్కుతో
చి యిదేమి నొంటిగని ♦ లేమను ముట్టగ పాడియానొకో.

అని పల్కి కొంచెము నడచి నిల్చుండియు, నేకాంతముగా వచ్చితి రేమియని యాతని హృదయ మతికోమలంబని క్రీగంట జూచుచు లజ్జాభరంబున వాయుసంచాలిత లతాకుంజముపోలిక కంపిత శరీరిణియై మీ రేకాంతముగా నాతో ముచ్చటించుట గురువులు జూచి రేని కోపించ రా? కాని దయయుంచు డని వీడని హృదయముతో మెల్ల మెల్లన పాదవిన్యాసంబు గావించు వెనుకకు మరలిచూచుచు నాశ్రమ ప్రవేశం బొనరించె నంత ౮౭

శా॥ ప్రాణుండాహృదయంబు గన్గొని లస ♦ ద్భావంబు గానించె తా
గానాద్యాఖిల శాస్త్రవేత్త యగుటన్ ♦ గాంచెన్ వరారోహత
ద్ధ్యానంబెప్పుడు వీడకుంటగని తా ♦ నాచార్య సాన్నిధ్యమై
యేణీలోచన నేమరిన్ దలమున ♦ న్లై విద్యతా నేరిచెన్.

గీ॥ చదువుచున్నప్పు డాకాంత ♦ చాయనుగని
తన్ను జూడగవచ్చె నీ ♦ తరుణి యనుచు
మదిదలంచుచు ప్రాణుండు ♦ మహిని "కామి
వనితచేష్టలు తనవని ♦ గొణుకుకొనడె?" ౯

గీ॥ పాఠముల్ జదువుచున్నట్టి ♦ ప్రాణుని గని
వహ్వరే! యని దల్చు నా ♦ వనిత "ధరను
కోరుకొను ప్రియుడేటి సం ♦ కోచమున్న
మన్మథుండని మెచ్చరే ♦ మగువ" లంత. ౧౦

౯ ప్రాణుండు గురునాజ్ఞంగొని స్వగృహంబు ప్రవేశించుట. *

క॥ ఇట్టుల కాలముగడువగ
నెట్టులొకో విద్య నేర్చి ♦ యింటికి నేగన్
గట్టిగల మనసుతో దా
నిట్టుల వచియించె గురుని ♦ కింపగునటులన్. ౧౧

ధారుణి మీకటాక్షమున ♦ తక్కువలేనటువంటి విద్యలన్
నేసుచుకొంటి నాకు తమ ♦ నిర్మలమానసిక ప్రధాన సం
పూరిత పండితప్రవర ♦ పూర్ణకృపారస ముప్పతిల్ల నా
చార విహార ధర్మల వ ♦ శంబగు దీవెనలింపు వేడుకన్.

వ. అని విన్నవించుచు నిలువంబడియున్న ఛాత్రాగ్రణిం గాంచి పవిత్ర ప్రశస్తంబగు తన హస్తంబున పృష్ఠభాగంబు నిమురుచు, నీ వినయంబుకు నీనేర్చు విద్యావిశేషంబులకుం దగిన సమగ్రంబైన యశస్సు గ్రహింతువని మరల నిట్లనియె

క॥ ఘనుడగు భృగుతాపసికిని
మనుమండవు గాన లోక ♦ మాన్యతగొని పా
వనమగు వంశము వర్ధిల
ననఘుండవు గమ్ము ప్రాజ్ఞ! ♦ యవనీస్థలిలో. ౯౮

గీ॥ ధరణి "పరనిశ్చయంబున ♦ దలకుబోసి
కట్నములు బెట్టి పంపిన ♦ ఘనులబోలె"
ఫలము లిచ్చియు నానంద ♦ బాష్పములను
శిరము దడిపెను ప్రాణు వ ♦ శిష్యుడపుడు. ౯౯

గీ॥ అచటి మిత్రులనెల్ల నో ♦ దార్చి పిదప
పుండరీకనుజేరి సం ♦ పూర్ణ భావ
నను తెలియగను తన గమ ♦ నంబు జెప్ప
దిగులుపడి లేచె మనసు క ♦ ధీరయగుచు. ౧౦౦

ఉ॥ ఎన్నడు వత్తు రీదిశకు ♦ యేమిపనుల్ గల విట్టిచోటులన్
మన్నన యేమిజేసితిమొ ♦ మాపయిలోపము లేవియున్న నే
మన్ననుతప్పటంచుహృద♦యంబున నెంచకుడయ్య నెయ్యమీ
కన్నను మీమనోబ్జమున ♦ గాపుర మొందగ జేయు వేడెదన్

గీ॥ అట్టి వాక్యము చెవిబడు ♦ నంతమోది
యయ్యు ప్రాణుండు ననె నిట్టు♦ లతివ నీదు

శీల సౌందర్య చర్యల ♦ చే హృదంత
రంగముననుండు నంచు బి ♦ రాన బలికె. ౯౮

వ. ఇట్టులానగొని సందేహిత పాదవిన్యాసుండై "బలిమిగా నత్త వారింటికేగు బాలికమాడ్కి" నెట్టకేలకు నదీ తటాకామల నతిక్రమించి హృత్పుండరీకంబు పుండరీక షట్పద మండితంబగుటచే, డోలికా డోలాయితంబగు మనస్సుతో గృహంబు ప్రవేశింప నంత ౯౯

గీ॥ వచ్చు పుత్రునిగని తల్లి ♦ మచ్చికగొని
కౌగలించియు దీవించె ♦ గనికరముగ
తండ్రికిని దండమిడి సమ ♦ తను వశిష్ఠు
జేరినదిగోలె జరిగిన ♦ చెయ్వులడుగ. ౧౦౦

వ. తా నేగినప్పటినుండి పుండరీక వృత్తాంతంబుగాక విద్యాభ్యాసంబును, వశిష్ఠు యాదరణంబును, నిత్యనైమిత్తికాది పుణ్యకారణ కరణంబులను సవిస్తరంబుగా దెల్పి మజ్జన భోజనాదు లొనర్చి సుఖంబుగానుండి రంత నక్కడ

* ౨౦ వసంతఋతు వర్ణన. *

ఉ॥ అంతవసంత మొప్పె హృద ♦ యాంతరసీమ దవానలంబులన్
నెంతయొ మండజేయుచును ♦ నింపగు గంధసుగంధవాతమున్
చెంతనెయుండ కాముకుల ♦ చిత్తజుధాటికి లొంగిపోవ నే
కాంతము లేని దంపతుల ♦ కౌగిలిచేరగ జేయురీతిగన్. ౧౦౧

వ. అవ్వసంతం బమందానంద సంధాయియై, పల్లవిత కోరకిత

కుసుమిత ఫలిత శాలరసాలయుతంబై, పల్లవభక్షణానేక
రక్తకంఠ కంఠస్వరాదాగత కుహూశబ్దయుత కోకిలా
యుతంబై, కుసుమనిష్యంద మకరందాస్వాదన మత్తష
ట్పద ఝంకార సంకులంబై, సర్వలోక కాంతాజనపయో
ధర మధ్యస్థ లక్షిత పంచబాణ సజ్జీకృత ధనుష్టంకార
సుందరంబై, లలనాజనాపాంగ సమాగత కాముక
భుజబంధబంధురంబై యొప్పు నమ్మధుమాసవాసరంబున

గీ॥ శుక్ల పూర్ణిమ చంద్రుడు ♦ శుద్ధుడగుట
బూర్ణకరములనుండగ ♦ పుండరీక
రామణీయము స్మరణకు ♦ రా హృదయస
రోజమున బ్రాణు డిట్టుల ♦ రూఢిదలుప. ౧౦౪

* ౨౧ పాళిణుడు విరహబాధ నొందుట. *

ఉ॥ అంతటమన్మథుండు హృద ♦ యాంతరవీథికలంచజొచ్చె వా
వంతయు బ్రేమలేకనె ప్ర ♦ భంజను డల్లనవీచె చెట్లపై
వింతగు పల్లవంబుదిని ♦ వీగెడుకోకిల గూయజొచ్చె వీ
రంత ప్రియావియోగ పరి ♦ హాసకులేకద! కామికెప్పుడున్

ఉ॥ వెంటనె సొమ్మసిల్లి తెలి ♦ విస్మరిజెందినుడిన్ కలంతతో
నుంటకు తోటకేగినవి ♦ యోగజతాపముడంగునంచు కు
ష్కంటకితాంగుడై శుకపి ♦ కస్వరసంయుతనైనతోట త్వా
నొంటరిజేరె నచ్చటిమ ♦ హోన్నతపుష్పసకుంజనస్థలిన్

గీ॥ జేరిసికతాతలంబున్న ♦ దూరి పాణు
ప్రాణములకెంతయో పుష్ప♦బాణు బాణ
మానుటకు చాలకుండుచు♦ హా! యటంచు
బలికె నిట్టుల దొట్రిలు ♦ పలుకుతోడ. ౧౦౮

ఉ॥ ఏలనె మోహమా! యిటుల♦ నెందుకు బాధల బెట్టుచుండుటల్
చాలదె కల్వరంబుగల ♦ చంద్రసమానన జేరబోయి కు
త్కీలల సమ్మగ్ర ధైర్యుని మ♦ తిన్ జలనంబుగ సేయ నేల యిం
కేల తపింపసేయకు మ♦హింసయె ధర్మమటంచు జెప్పమా

ఉ॥ వీరుడనంచు నాపయికి ♦ విల్లును గైకొని వచ్చినావు నీ
సారము జూపబొమ్ము ఇక ♦ చాలును లెమ్ము యనంగ నీవు శృం
గారగిరిస్తనిన్ మిగుల ♦ కాతర బెట్టకు పాపమయ్యో నీ
వీతర చూపు శక్తిగల ♦ వీరుడవైన గిరీశు మీదటన్.

చ॥ ఇపుడు వసంతవాసరము ♦ లేటికి వచ్చెను లేచిగుళ్లనున్
గపుకున మెక్కి చెట్లపయి ♦ కన్నులు మూసియు కేకలేసినన్
కుపితుడనౌదునంచు మది♦ కోపము జేసిన లెక్కయౌనయో
న పకమ శ్రావణంబున ని♦సీ! యెటులుందువో గర్వమేటికే

శంబరారికి మామవు ♦ చందమామ
నతని కఠినత్వమొందితి ♦ వందువలన
గురుడు శాపంబు బెట్టెను ♦ కువలయేశ
యింక యేమౌనో నీగతి ♦ యెవరి కెరుక? ౧౧౧

గీ॥ ఇట్లు తాపంబు రెట్టింప ♦ నింతికొఱకు
వేడి నిట్టూర్పు విడచుచు ♦ వేయిపొగ్లు
పుండరీకను దలచుచు ♦ మండితముగ
స్వాశ్రమంబును జేరెను ♦ నార్తితోడ. ౧౧౨

వ. ఇట్లహోరాత్రంబులు తపించు ప్రాణుని గని తోటిబాలకు
లా వృత్తాంతంబు తల్లికి నివేదింప నామెయు విధాతకు
దెలిపిన కుమారుని స్త్రీవ్యసన విరహపరితాపంబు మా
నుపగల మంత్రము నాలోచింపుచుండె నచ్చట ౧౧౩

* ఇది పుండరీక విరహంబుచేఁ దూలుట. *

గీ॥ అదిమొదలు ప్రాణనాయకు ♦ డైన ప్రాణు
డెటుల గనుపించునంచని ♦ యింతి నవయు
నెప్పుడేవేళ గనుపించి ♦ యేలుటకును
తలపుగలుగునో? లేక సం ♦ తాపపడునొ? ౧౧౪

గీ॥ వింతపూవుల గూర్చియు ♦ కాంతలంత
శయ్యజేసిన పడుకొని ♦ సారసాక్షి
చందురునిగని విరహంబు ♦ గ్రందుకొనగ
పలికె నిట్టుల మిగుల వి ♦ చ్చలవిడిగను. ౧౧౫

గీ॥ స్త్రీల వేధింప నీకేమి ♦ శీలమలరె
గొప్పవారింట బుట్టి యీ ♦ కుటిలతనము

సేయుటకు మంచితనమౌనె ♦ చిన్నతనము
చందమామా, నన్ను వేధింప ♦ చందమామ. ౧౧౬

గీ॥ అన్నమును పున్నె మెరుగని ♦ కన్నెనగుట
శాపమిచ్చిన తిరుగదు ♦ శర్వరీశ!
నిజముగా నీదు కళలెల్ల ♦ నిత్యతరుగ
పౌర్ణమాసిని నీ సదా ♦ పాముగరువ. ౧౧౭

మ॥ అని దూషించి పతాకసుద్దులను శు ♦ భ్రాంశున్గళాయించగా
ఘన సజ్జీకృత పుష్పచాపమలరన్ ♦ కాముండు నేతెంచి కాం
తను లక్ష్యంబుగ జేసి పుష్పశర సం ♦ ధానంబు గావించి నం
తనె మూర్ఛిల్లియు లేచి యిట్టులనె క్రో ♦ ధవ్యాప్తి సంధిల్లగన్

గీ॥ అఖిల దోషంబులను మ్రింగు ♦ నసురవిభులు
నిలచినను, బోరబరిమార్చె ♦ నీదుతండ్రి
యతని పుత్రుడవయ్యు నీ ♦ వబలలందు
పౌరుషంబును జూపగ ♦ బాడియౌనె? ౧౧౯

గీ॥ తప్పుజేసినవారికి ♦ తగినశిక్ష
మున్ను ననసూయ విధియించె ♦ మోసగాడ
నీదు నారియు పురివిప్పి ♦ పోదలంప
నీశరంబులు వాడి వ ♦ న్నియలు దరుగ. ౧౨౦

శా॥ ఈరీతిన్ శపియింప బాలిక, షికం ♦ బింపారగా బాడ నం
గారాస్పర్శకు దుల్కనొందుగతి తా ♦ గంపించి కంతాన వ

హ్వారే: కోకిల గర్వమెక్కి నను నే॰ వ్యాపించు వేధింతు వే
రా రా! రామనటంచు నెంచుచిక మో॰హాంబున్న నిల్లోగదా.

క॥ అని యిట్లుబల్కు కాంతా
మణిపై పవనుండు వీచ॰ మంచుచు బలికెా
ఘనమా పవనా నీ సా
ధనమా నన్నేచ నీకు॰ ధర్మంబౌనా. ౧౨౨

గీ॥ రట్టుసేయక పొమ్ము నే॰ దిట్టినంత
తప్ప దారార సప్పములీ॰ తగభుజింప
కనుపడని భూతమైపోను॰ వనుగనంబు
కనుము నాఘ్రాణ గంధవ॰ గవ్రీణ. ౧౨౩

వ. అని యిట్లు మన్మధ పవన చంద్రాదుల దూపించి, మనం
బాందోళనంబొంద చేయుట కేమిదోచక, చెలికత్తెలడుగు
ప్రశ్నలకు సమాధానంబివ్వక కోపగింపుకొనుచు, వేడి
నిట్టూర్పుల కధరోష్ఠంబులు వాడ, చంద్రాదుల ప్రార్థిం
చిన కొంత తాపంబడంగునని తలంచి యిట్లనియె ౧౨౪

గీ॥ శీతకరుడంచు నెత్తిన॰ శివుడు దాల్చి
గౌరవించెను, భార్గవీ॰ కాంత కెలమి
సోదరుడవైతి విటువంటి॰ వాద మేల
కరుణ వేధింప కిదె నమ॰ స్కారమయ్యా. ౧౨౫

చ॥ స్మర జటగాను వేశియుది, ॰ చంద్రుడుగా డిది కేతకీదళం,
బురగ గళంబుగాదుర స॰ముద్ర విషంబిది, గాదు జూడ క

## ప్రథమాశ్వాసము.

స్ఫురిత విభూతి, గాదు ప్రియు ♦ తో నెడబాటునబుట్టుదెల్వి, నా
పురహరుడంచు నెంతు వేశి ♦ నీ మోనమయూఖ్యానిగాపు మన్మథా

గీ॥ జీవనిచయంబుకెల్ల సం ♦ జీవి వనుచు
పలుకుదురు గాన బ్రోవుమో ♦ పవన నన్ను
దయదలంచియు నావార్త ♦ ప్రియునకిచ్చి
మమ్ముగూర్పగ యత్నింపు ♦ మలయ పవన.

* ౨౩ పుండరీక మూర్ఛిల్లుట. *

వ. ఇట్లు ప్రార్థించిన నమ్ముగుద మంతనంబున నెంతయో వింతగు సంతాపంబు రెట్టింప గజగమనయై తూగ తూగ జిగ జిగ మెరుంగు శృంగారంపు గబ్బిగుబ్బల బయ్యెద సవరించుకొనక, బుస్సు బుస్సుమని బుసగొట్టు సర్పంబు పగిది వేడినిట్టూర్పులు బుచ్చుచు, నిడుదయైన తడబడు జడ నైన సవరింపక, మెల్ల మెల్లన జల్లనిపీడల విశ్రమించిన నుల్లంబు సంతసిల్లక పల్లవాన్వితంబులగు వృక్షంబుల దిట్టుచు, పచ్చని పచ్చిక బయల్ల మెచ్చి యిచ్చతో నచ్చట బరుండి కొంతదవ్వున కాబాల తృణంబు బెకల్చి నీకేల యీ యుష్ణగుణం బబ్బినదని నేలజరచుచు, దొయ్యాలి వొయ్యారంబుగా నుయ్యాలనూగిన తాపం బెక్కువయిన సహింపనేరక చెలుల నీసడించుకొనుచు బుష్పశయ్యపై మూర్ఛిల్లిన

* ౨౮ తోడిబాలికలు వసిష్ఠునకు పుండరీక వృత్తాంతము దెల్పుట. *

గీ॥ ఇట్లు తపియించు బాధ స ♦ హించలేక
తోడిబాలిక లంద రా ♦ తొయ్యలి గని
గురునకును జెప్ప నేగిరి ♦ కొంద రిచట
చెలులు శైత్యోపచారముల్ ♦ జేసిరంత. ౧౨౯

గీ॥ శిష్ట మౌనీంద్రుడైన వ ♦ శిష్ఠునకును
దండమును బెట్టి జెప్పిరి ♦ పుండరీక
మదన తాపంబు నెల్ల న ♦ మ్మౌని వినియు
యోగదృష్టిని జూచె న ♦ య్యోగమంత. ౧౩౦

* ౨౯ వసిష్ఠుడు విధాతాశ్రమంబున కొక శిష్యుని బంపుట. *

చ॥ ఘనుడు విధాత నందనుని ♦ కన్య వరించుట గుర్తెరింగి శి
ష్యునిగని భార్గవాశ్రమము ♦ జొచ్చి మదీయ కుమారి చెల్మిని
తనయుని గోరెనంచని వి ♦ ధాతకు దెల్పుము, దెల్పినంత నా
మునివరు డేది జెప్పినను ♦ మోదమునందగ నాకు దెల్పుమీ

* ౩౦ వసిష్ఠశిష్యుడు విధాతాశ్రమంబునకేగి వచ్చినవిషయము దెల్పుట *

మునివాక్యంబులు శ్రద్ధగావిని మహా ♦ మోదంబు నుప్పొంగ వెం
టనె పైబ్దేరి వనాంతరంబులను న ♦ డ్డంబైన శైలాదు లెం
తనో తా దాటి విధాతవాసముననే ♦ తత్కన్యకాహ్వాద్గతా
ష్యుని మున్ముందె దృశించె నంత మునిచం ♦ ద్రుడయ్యెడ న్వేడుక

క॥ వచ్చిన మునిశిష్యుని గని
మచ్చికతో గౌరవించి ♦ మౌనికి శుభమే?
యచ్చటి జనులకు సేమమె?
యెచ్చటికీ నీదుగాక ♦ యెరిగింపు మనన్. ౧౩౩

చ॥ గురువరుడంపివాడు తన ♦ కూతురు నీసుతునే వరించెనా
సరసిజనేత్రి కోర్కె దమ ♦ సన్నిధిజెప్పగ బంపె నన్ను నే
మరక 'శుభస్యశీఘ్రము' ను ♦ మాటదలంచి ముహూర్త మిప్పుడే
స్థిరమును జేసి బాపుడన ♦ చిత్తము సంతసిలంగ నిట్లనెన్.

గీ॥ ఔర తమకంటె నే పెద్ద ♦ నని దలచ
న్యాయమా? మౌని తెలియని ♦ నయముగలదె
అయిన నాతనియాన శీ ♦ ర్షాగ్రమునను
దాల్చి వచియింతుననుచు వి ♦ ధాత యపుడు.

{ ౨౭ విధాత సుముహూర్తంబు నిశ్చయించి వసిష్ఠునకు బత్రిక నంపుట. }*

గీ॥ నియతి కెరిగించి వెంటనే ♦ నయవిదుండు
తనదు శిష్యులబంపి కా ♦ ర్తాంతికులను
బిలచి లగ్నము బెట్టించి ♦ ప్రీతి ఫలయు
తంబు పత్రిక నిచ్చి వి ♦ ధాత పలికె. ౧౩౬

గీ॥ అనఘ యీ శుభపత్రిక ♦ గొని యరుగుము
తర్లివత్తుము పౌష్మార ♦ ధరణి సురుడు

సేగె సంతోష మెంతయో ♦ యనుమోదింప
నాశ్రమంబును జేరి యా ♦ చార్యు నీడ. ౧౩౭

* శ్రీ పుండరీక వివాహము. *

గీ॥ సంతసించియు వెంటనె ♦ సకల మునుల
రమ్మనుచు బంపె శిష్యుల, ♦ సొమ్ములెల్ల
దగు విధంబున సమకూర్చి ♦ తారసిల్లు
లగ్నముఁ జూచుచుండె వి ♦ లాసముగను. ౧౩౮

ఉ॥ వచ్చెడి బంధుజాలమున ♦ వశ్యము సేమ మెఱింగి గౌరవం
బెచ్చట గల్గుచోట నివ ♦ సింప నియామకమెల్లజేసె వా
ర్వచ్చిన జాడ గుర్తెరిగి ♦ వాంఛ నెదుర్కొని గౌరవంబుతో
ముచ్చటజెప్పి తా విడిది ♦ మోదముతో నివసింపజేసినన్.

క॥ ఆరాత్రి మంటపంబున
గారా బల్లునికి కాళ్లు ♦ గడిగియు పిదపన్
ధారాదత్తము జెసె కు
మారిని శుభలగ్నమందు ♦ మన మలరంగన్ .౧౪౦

గీ॥ పుండరీకను వివిధ సు ♦ భూషణాది
తతుల భూషించిదెచ్చిరి ♦ తల్లివెంట
పెండ్లి మంటపమందున ♦ ప్రేమతోడ
ముగుద గూర్చుండె భర్తకు ♦ ముకురమనగ. ౧౪౧

ఉ॥ నాతిచరామియంచు తన ♦ నాథుడుబల్కఁగ చాలకింపుగా
నాతిగ్రహించి యుల్లము స♦ నాతనధర్మ గుడంబు జీరయుఁ
బ్రీతిగ ప్రాణుశీర్షమున ♦ బెట్టుమటంచని విప్రులన్న వి
ఖ్యాత ధనుస్సుపోలిక ప్ర♦ కంపిత మధ్యము వంచిపెట్టెనఁ

గీ॥ పాణి గ్రహియించి నంతనే ♦ ప్రాణు తాప
మంతదీరెను నట్టులే ♦ కాంత దేహ
తాపమంతయు శమియించె, ♦ తరణి తాప
శమనమొందదె? నీటికి ♦ జనిన యంత. ౧౪౩

వ. ఇట్లు యథావిధిగా నైదుదివసంబులు వివాహంబుగావించి యారవనాడు మజ్జన భోజనాది కార్యకరణానంతరంబు కన్యక నప్పగించిన బ్రాహ్మణుండు వధూసమేతుండై స్వాశ్రమ ప్రవేశం బొనరించి సుఖంబుగ నుండిరనుటయు.

* ఆశ్వాసాంతము. *

కుపథానేకవనౌఘనాశ హుత భు ♦ గ్రూపానత స్తోత్రి! పా
దపయోజాత మురాంతకా! కుశలసం♦ ధాతా! గదాహస్త! ధ
ర్మపరా! శాంతగుణాంబుధీ! జటిల స♦ న్మానా! మహాదేహ సౌ
ఖ్యపథాక్రాంత కలాకలాప! శశి మి♦ త్రాక్షా ధరానాయకా,

* మాలినీ వృత్తము *

సరసగరుడవాహా ♦ సద్గుణాది ప్రవాహా
వరదను సుత శిక్షా ♦ భక్తరక్షైక దీక్షా

సరసిజ మృదుపాదా ♦ సామవేదానుమోదా
ఖరకర సమభాసా ♦ కాంచనాహార్యవాసా. ౧౭౩

గద్య

ఇతి శ్రీమదలర్మేల్మంగానాయక వేంకటేశ్వర పాదారవింద
ధ్యానాసక్త కౌండిన్యసగోత్ర పవిత్ర పాపయాఖ్య
పుత్ర కనకమాంబా గర్భశుక్తి ముక్తాఫల
పూర్ణానంద వాడపల్లి ఆగయాఖ్య
రాజయోగి ప్రణీతంబైన మేరు
వంశ పురాణంబునందు
ప్రథమాశ్వాసము
సంపూర్ణం
శ్రీ వేంకటేశ్వరార్పణమస్తు.



శ్రీ వేంకటేశ్వరాయనమః

# మేరువంశ పురాణము

## ద్వితీయాశ్వాసము

కర కరుణాసాగర
పాకారి సమాన విభవ ♦ పావనభావా
లోకవశీకర సుగుణా
స్తోక శ్రీ వేంకటేశ ♦ తోయనివేశా. ౧

వ. అవధరింపుడు తొల్లి పరీక్షన్మహారాజునకు శ్రీశుకయోగీంద్రుఁ డిట్లనియె. నట్లు ప్రాణుండు వివాహ సంజనితానంత సంతోషస్వాంతుండై పుండరీక నయనానంద చకోర చంద్రుండై కాలంబు గడుపుచుండె నంత ౨

✻ శా. గ్రీష్మఋతు వర్ణన. ✻

దినమానంబది హెచ్చె గ్రీష్మఋతు సం♦దీప్తుల్ ధరించెన్, సమీ
రునియందున్ దగు వేడి హెచ్చె, ముగుదల్ ♦ రూపంబు సాయంతనం
బున శృంగార మొనర్చి వాకిలిని నిం ♦ పుల్మీర మానుష్యులన్
ఘన మోహాంధులజేసి క్రీడలకు కాం♦క్షల్ గల్గు నట్లుందురా.

గీ॥ అట్టి కాలంబునందు న ♦ నంగ సంగ
రంబునందున కష్టించు ♦ రమణులకుచ
ములను జనియించు ఘర్మకం ♦ దళములార్ప
వచ్చుచుండును వేకువ ♦ వాతతతులు ౭

* ౩౦ పుండరీక ప్రాణులు దేవతా పుణ్యస్థలంబులను చూడబోవుట. *

చ॥ ఇదె తరుణంబు పావనమ♦హీస్థలులన్ ముని విష్ణువాస సం
పదలను పుణ్యపర్వత ని ♦ వాసము లబ్ధితరంగిణీ మహా
నదముల జూచివత్తమని ♦ నాతుక వెంబడిరా, సిరంగనిన్
ముదమున సేవజేయుచు న♦మోనమయంచని వేడివేచనిన్

* { ౩౧ పుండరీక ప్రాణులు బదరి కాశ్రమంబున నరనారాయణుల సేవించుట. } *

గీ॥ పూర్వమందున నరునకు ♦ బోధజేసి
నట్టి దివ్యస్థలంబు నా ♦ రాయణుండు
సకలపాపంబులన్బాపి ♦ జగతి బదరి
కాశ్రమంబన నిడియొప్పు ♦ నతివచూవె. ౮

నరనారాయణ రూపముల్ గని మహా ♦ నందంబుతో వారినిన్
బరిపూర్ణంబగు భక్తితోడ మదిలో ♦ ప్రార్థింప పుష్పార్చనా
పరులై పూజలజేసి యిట్లనిరి మా ♦ భాగ్యంబు నీవయ్యా! శ్రీ
వర! మాకోర్కెలదీర్పు పుత్రునొకనిన్ ♦ వాంఛింతు మేమీశ్వరా!

గీ॥ అట్టి పుత్రుండు సుగుణ గ ♦ ణాన్వితుండు
భక్తియుక్తుడు తమహూపు ♦ బరగువాడు

సంశరక్షకుడయ్యెన్ను ♦ వరలు నొకని
దేవ! యొసగుము మాకెంతో ♦ దీప్తిగలుగ.

గీ॥ అనుచు ప్రార్థించి పూజించు ♦ సంతలోన
సూతుడే తేర సంతోష ♦ పూతచిత్తు
లగుచు పూజించి జోవమ ♦ హాత్మునసియె
ప్రాణ! నావంటి పుత్రుని ♦ బడయుముయ్యె.

గీ॥ అనుచు దీవించి యిట్లని ♦ యాన నొసగ
పర్వ దివసంబు రేపాట ♦ భార్యతో మ
హా విబుధవాహినీ స్నాన ♦ మాచరించి
గేహమును జేరబొండింక ♦ క్షేమమగును.

గీ॥ అనుచు జెప్పగ నమ్మాని ♦ యానసెల్ల
శిరమువందునదాల్చె వ ♦ శిష్ఠు తనయ
మానసం బెంతొ సంతోష ♦ మగ్నమయిన
పశ్చిమాంబుధి సూర్యబిం ♦ బము చెలంగె.

✻ 3-౨ సాయంకాల వర్ణన. ✻

గీ॥ భర్త నెడబాసి దుఃఖించు ♦ భామబోలె
నీటివరకొంగి లేచియు ♦ నీటి చుక్క
లొడుపుచుండియు ముకుళించె ♦ ను స్సురనుచు
షట్పదంబుల ఝుంకార ♦ శబ్దములర. ౧౨

అంతట రాజదర్శనము ♦ కై కను బంటులబోలె తారకల్
వింతలుదోచె గుంపులుగ ♦ విష్ణుపథంబున పిల్లవాయువుల్

సంతసమివ్వ వీచె, కలి ♦ సారసనేత్రిలు భర్తరాకకై
మంతన మాడుచుండగ త♦ము స్సుమహీస్థలినిండె నిండుగన్
కుముదంబుల్ వికసించె, జక్కవలుము♦క్కుల్ వంచె,నక్షత్ర సం
ఘములున్ వెంటనెవచ్చె లోకము నిదా♦ఘ క్షీర శాంత్యర్థమై
తమగేహంబుల ముందటంనిలచి స్వ ♦ ద్వారంబులన్ జేరు నా
రమణీరత్నము లెందరోగనిరి త ♦ ద్రాజోదయం బౌటయున్.

వ. ఇట్లు చంద్రోదయంబగుటయు వెంటనే సముద్రప్రాంత
మగు నొక యాశ్రమమున పుండరీక దండనుండ వేదాంత
రహస్యార్థంబుల దెలియ జెప్పుచు న య్యాశ్రమంబున
బరుండి రంత ౧౫

* ౩౩ ప్రాతఃకాల వర్ణన. *

గీ॥ వేకువని బోవువారికి ♦ వింత చుక్క
చుక్క లన్నింటి లోపల ♦ శుభమునొక్క
నెక్కినంతని వేకు వ ♦ నింగి కెక్క
వెలసె తేజంబుతోనుండు ♦ వేగుజుక్క. ౧౬

గీ॥ ఎంతమట్టుకు నిద్రింతు ♦ రెట్టి జనులు
స్నానమున్ జేసి యీశ్వరు ♦ సన్నుతింప
కాలమాయెను లెండంచు ♦ కంఠమెత్తి
కాలవిచ్చరణాయుధ ♦ గణముగూసె. ౧౭

కమలములెల్ల విచ్చె, పల ♦ కంబుల పక్షులు గూయజొచ్చె, తే
జములలిజారె తారకల, ♦ చంద్రుడు చీకటితోనెదూరె, నా

కుముదముఖాళిమూసుకొనె,♦కోళ్లునుగూసె,తమస్సు బారె,ప్రా
క్సుమునితండ్రి తేజము జ ♦ గంబులనంతట హెచ్చెమచ్చుగన్

గీ॥ రణముజేయగ వచ్చెడి ♦ రాజుకంటె
ముందు నడిచెడి సేవక ♦ బృందమనగ
సూర్య కిరణంబులన్నియు ♦ శోభగలుగ
గగనభాగంబు నంతయు ♦ గ్రమ్ముకొనియె. ౧౯

* ౩౮ పుండరీక ప్రాణులు గంగానదిలో స్నానమాడుట. *

వ. అంత సూర్యోదయం బగుటయు ప్రాణుండు ధర్మపత్నీ సహితుండై నుత్తుంగ కల్లోల ఘోషాయితంబై యనన్య సామాన్య కమలాసంయుతంబై విష్ణుదేవుని మందిరంబును బోలె చక్రకమలాలంకృతంబై, ధనరాజు రాజ్యంబుభాతి మహాపద్మ శంఖ మకరకచ్ఛపాక్రాంతంబై, మన్మథబాణ పంక్తివలె నరవిందాశోకనీలోత్పలాది విరాజితంబై, రామరావణ యుద్ధంబుభాతి ఘోర భీకర కల్లోల శబ్దాయితంబై, నారదునివలె స్వచ్ఛఫేన కలకలా రాజితంబై, కుధరంబునుబోలె కుదరయుతంబై, దశావతారంబులబోలె కూర్మ మీనాశ్రితంబై యొప్పు భాగీరథీనదింగని ప్రముదితాంతఃకరణుండై దంపతు లిరువురును పవిత్రహృదయంబులతో సూర్యభగవానుని కెదురునిలచి సకలాంతర్వర్తియగు సర్వేశ్వరుని ధ్యానింపుచు సంకల్పప్రకారంబుగా నఘమర్షణ సూక్త మంత్ర పఠన పూర్వకంబుగా స్నానమొనరించి ౨౦

ఉ॥ స్నానము జేయునప్పుడు ని♦జంబగు మంత్రములెన్నొ బాడిసం
తానముగల్గ దీవనలు ♦ తాపసవర్యు వరప్రదానముల్
పూనికరక్షజేయుము స♦మున్నత తేజయటంచు మ్రొక్కుచున్
మానిని పూజజేసె నిజ♦మానసపూర్తిగ సత్కరించుచున్

వ॥ తడిసిన చేలముల్ విడచి ♦ దంపతు లిర్వురు నిత్యకర్మకా
కడలికిదాపునన్ నిలచి ♦ కర్మకుసాక్షి సరోజ భర్తకై
విడచియు నర్ఘ్యబిందువుల♦వేదమయాత్మక మమ్ముగావ కేల్
ముడిచినమస్కరించెదము♦మోఘ సుకర్మల ప్రాప్తికై యిలన్

* 3॥ ప్రాణుడు సూర్యాంతర్వర్తియగు నారాయణుంగని స్తుతించుట. *

గీ॥ బ్రహ్మ విజ్ఞాన సంపత్తి ♦ పటిమగల్గు
ప్రాణుదృష్టికి సూర్య ప్ర ♦ భనుగల హరి
బింబమును జూచి హృదయాన ♦ ప్రేమగలుగ
స్తోత్రమును జేసె నిట్టుల ♦ శ్లోకముగను. ౨౩

## దండకం.

శ్రీ కామినీమానసాంభోజషట్పాద లోకత్రయవ్యాప్త నీపావనాంఘ్రిద్వయాబ్జాతమందున్ మమస్వాంత భృంగంబు జేరంగ నూహింతు రక్షింపవే లోకమందెప్పుడున్ ధర్మవిభ్రంశ మున్ గలుగగా నప్పుడే రక్షణంజేయగా జన్మలేకున్న జన్మించి పాపాత్ములన్ జంపి ధర్మంబు గాపాడవే భక్తులన్ గాచి మోక్షంబు చేకూర్పవే రామకృష్ణాది రూపంబులన్ ధర్మమార్గం బనుష్ఠించి లోకాళికిన్ మేలుగల్గింపవే వేదవేదాంత వేద్యా

మహారూప నారాయణా మమ్ము్మబ్రోవంగ భారంబునీదేకదా దేవ నాతాత నీమంత్రము౦ జెప్పుడున్ నిన్ను నీమూర్తి నిన్ జెప్పుచుండంగ నేవింటి నేనెంత ధన్యుండ దీనావనా భక్త రక్షైక దీక్షా నమస్తే నమస్తే నమస్తే నమః ౨౮

వ. అని ప్రార్థించి నిత్యకర్మానుష్ఠానవిధి నిర్వర్తించి యచ్చటచ్చట పుణ్యవనాంతరంబుల బ్రవేశించి ఫలంబే యాహారంబుగా ననుభవింపుచు శైల నదీతటాకారామాది స్థలంబుల గాంచుచు తుదకొక శుభలగ్నంబున నాశ్రమంబు ప్రవేశించి రంత ౨౯

## ❋ ౩౬. పుండరీక గర్భము ధరించుట. ❋

గీ॥ సరసిజాతాక్షి కీశ్వరు ♦ కరుణ వలన
గర్భము వహింపనయ్యె సౌ ♦ ఖ్యమున నపుడె
కోరికలుబుట్టె బ్రాణుడు ♦ కోర్కె ఫలము
సఫలమాటకు నెంతయో ♦ సంతసించె. ౩౦

వ. ఇట్లు సంతోషంబున తృతీయమాసంబు ప్రవేశింప నోరు రుచింపక నన్నముదినుట నొల్లక ఫలభక్షణ ప్రీతివిడనాడి వింత గోరికల గోరుచు బ్రాణుని మనస్సున కాయాసంబు గాకుండ నప్పుడప్పు డేకాంతముగా గూర్చుండి కాలంబు గడుపుచు నందొక్కనాడు ప్రాణనాథునితో పుండరీక యిటనియె. ౩౧

* ౨౨ పుండరీక ప్రాణునిం గురించి పిండోత్పత్తిక్రమంబు ప్రశ్నించుట. *

గీ॥ నాథ! యీ గర్భ కుహరము ♦ న బహుకష్ట
ములను బడుచుండు జీవి త ♦ నోర్మ చనంబు
నెట్లు బొందును? నిందులో ♦ నెట్లు జేరు?
నట్టి విధమెల్ల బోధింపు ♦ మనగ బలికె ౨౮

* ౩౮ పాణ్ణీంకు పుండరీకకు పిండోత్పత్తిక్రియము దెలుపుట. *

ఉ॥ జీవులు పూర్వజన్మకృత ♦ శేషఫలానుభవాదికర్మ యే
కేవును లేక నాకస ప ♦ రీవృత దేహముతోడనుండి సం
భావితుడయ్యు వెంటనె ప్ర ♦ భంజను జేరియు కొన్ని నాళ్లకుఁ
బావకునందు కొంత గడ ♦ పంగనె తా జలమందు జేరుచుఁ

గీ॥ జేరి పిమ్మట పృథ్వీలో ♦ జేరి యచట
వత్సరాల్ కొన్ని గడపియు ♦ వసతిగాను
నోషధీతతి గడుపు న ♦ నూనముగను
కాల పరిణామ మెప్పుడో ♦ గలిగినంత. ౩౦

క॥ ధరణిని యన్నము నందున
సరిగా జేరగను కాల ♦ సామీప్యమునఁ
పురుషుని రేతస్సునబడి
యరుగును కాలంబు కొంత ♦ నయ్యె విధులఁ. ౩౧

ఉ॥ పిమ్మట దల్లిగర్భమును ♦ భీకర సంధ్రిములోన మున్గియుఁ
దొమ్మిది మాసముల్ బెరుగు ♦ వొల్తి నెలంగలలంబుపోలికఁ
సమ్మతి నైదురాత్రముల ♦ సాగును బుద్బుదరూపుత్తోను తా
నిమ్మహినుండు నేటికి న ♦ హీనతవృత్తి చరించు నచ్చటఁ

వ. తర్వాత కర్కంధువై దశరాత్రిలలో బరిణమించి, యా మీఁద దేశస్వరూపంబునొంది తొలిమాసంబున కల్పస్వరూపంబు నొందు 33

సీ॥ రెండవ మాసము ♦ రెక్కొనె శీర్షము
గలిగి మూఁడవనెల ♦ సలలిత నఖ
త్వగ్రోమలింగ వి ♦ వర మహాస్థులు, నాలు
గవనెల సప్తధా ♦ తువులు గల్గు
నైదవ నెలలోన ♦ నాకలి తృష్ణలు
గలిగి గర్భాంత్రి భా ♦ గముల మెలగు
మరియు నాగవనెల ♦ మావిచేత బొదువ
వడి గర్భ దక్షిణ ♦ భాగమందు

గీ॥ ఘనత దిరుగుచు మాతృ తి ♦ క్త కటుసహిత
భోజన పదార్థముల బాధ ♦ బొంది సప్త
ధాతు సంజనితుడయి పి ♦ దసను జంతు
సహిత విణ్మూత్రిములబడి ♦ సంచరించు. 3

వ. తర్వాత గర్భకోశంబున దిరుగుచుండి తత్రస్థిత క్రిమికీ కాదులచే బీడింపబడుచు తద్ఘాతాయాస మూర్ఛితుం మాతృభక్షితానేక రసద్రవ్యాద్యుల్బణంబులైన రసం లచే బరితప్తాంగుడై, జరాయువున కప్పబడి, కుక్షియంద శిరంబు మోపికొని, భగ్నంబైన కంఠోదరుండై తన శ రము జలింపజేయ సమర్థుండు గానేరక, పంజరబద్ధంబగ ద్విజంబు పోలిక నీశ్వర దత్తంబగు పూర్వజన్మ జ్ఞానం

వలన పూర్వజన్మార్జిత కర్మంబులెల్ల దుష్కృతంబులగుట కేంతేని చింతింపుచు దీర్ఘోచ్ఛ్వాసంబుల విడుచుచు నే సుఖంబులు లేక వృద్ధిబొందుచుండు ననిన విని పుండరీక యిట్లనియె 3౫

గీ॥ దైవకృతమైన విజ్ఞాన ♦ జీవికవుడు
యిూశ్వరానందమును బొందు ♦ టే నిజముని
జెప్ప వింటిని మీమాట ♦ ఇప్పు డట్లు
తెల్ప రేటికి? మీరింక ♦ ధీరచరిత! 3౬

వ. అనిన నా రాజవదనకు బ్రాణుం డిట్లనియె. పిమ్మట నేడవ మాసంబున క్రిమికీటకాదులకు సోదరునివలె జ్ఞానంబు గ ల్గియు చేష్టలుదక్కి గర్భంబున నటునిటు దిరుగుచు సూ తికావాతంబున నిశ్చేష్టితుండై గర్భనరక బాధ భరింపలేక కృతాంజలిబద్ధుడై తా నెవ్వనిచే సృజింపబడెనో నట్టి భగ వత్ప్రార్థనంబు జేయుచుండ జఠరాగ్ని పరితప్త శరీరియై యెట్టకేలకు పదియవమాసంబున భగవదిచ్ఛచే బ్రసూతి మారుతమను నొక వాయువు ప్రవేశించి నెట్టిన నెట్టుటో భూపతనంబు గల్గుచుండునని యిట్లనియె 3౭

* 3౮ ప్రాణుడు పుండరీకకు బాల్యావస్థాది తెరంగు లెరింగించుట. *

క॥ క్రిమికీటకాది బాధా
శమమునకై తీట గోక ♦ శక్తి యు లేకుం

డ మలముల మూత్రములలో
కుములుచు పసికూన దుఃఖ ♦ కూపమున బడుగా. ౩౯

గీ॥ తనర బాల్యమునందున ♦ "తాత" యనుచు
మాటలను నేర్చి క్రీడల ♦ మరుగుపడియు
తప్పటడుగులు వేయుచు ♦ ధాత్రియందు
జ్ఞానవృత్తిని దెలియ డ ♦ జ్ఞానుడౌచు. ౩౯

గీ॥ వయసునందున కాంతల ♦ వాంఛ జేసి
ఐహిక సుఖంబులఁ గోరు ♦ నవని లింగ
కుక్షి సౌఖ్యంబు నెంచుచు ♦ కుమతి దెలియ
జాలడెంతయు తన దుష్ట ♦ జన్మలన్ని. ౪౦

వ. ఇట్లు వయఃకాలంబున శిశ్నోదర పరాయణుండై తన జన్మ
కారణం బరయక క్రమంబుగా వృద్ధత్వంబు ప్రాప్తింప

చ॥ ముసలితనంబునందు సుత♦మోహము చేకడు దుఃఖభాగియై
మసమసలాడు రోగముల♦మంధుచు దేహముజీర్ణమయ్యె తా
నుసహాన మొందడెవ్వరిని♦నొచ్చును నెవ్వరుతచ్చు జూచినః
రసన స్మరింపదెప్పుడు వి♦రాగముతో హరిపాద పద్మముల్

వ. ఇట్లు జరాప్రాదుర్భావమున సకలాంగంబులు...క్షీణింప,
లుకలుకం గదలు దంతంబులును, లోన్నికేగి దిన్యాభీతంబుల
కుం బలె భయంకర స్వరూపంబున నుండు లోచనద్వ
యంబును, దోధూయమానంబై ఓష్ఠాధరంబువలె నూగః

లాడు సర్వాంగీణ చర్మంబును, సకల రసంబుల నాస్వా దింప దలంచుచు రసగ్రహణ శూన్యంబైన రసనచే రుచుల గొననేరక చప్పరింపుచు, నోరులు దూషించిన వినరాక, అన్యవస్తువుల జూడనేరక, పరులుబల్కిన మాటలు విననేరక, యితర స్వాధీనముచే స్థితిగమన శయనాదులు గడచుచుండ, మిత్రులు దూషింప, శత్రువులునవ్వ, బంధువులు ముక్కువిరువ, సుతులకు రోతజనింప, భార్య యేవగింప, కంఠగత ప్రాణుండై, ప్రకృతి జనితవాసనా విశేష సంజనితాజ్ఞానాంధకారావృతుండై హరిస్మరణంబు జేయక, దుష్కర్ముండేని యమభట దర్శనాత్ప్రాణో త్కర్షణంబై నిరయబాధననుభవించు, నిక పుణ్యపురుషుం డయ్యేనేని సదాచార్య సమాశ్రయణంబున సంసారంబ సారంబనియును, ఐహికంబుల స్థిరములని మనః ప్రవర్త మాన వైరాగ్యుండై తామరాకుపై నీటి చందంబున సంసారంబున నుండియు నంటి యంటని విధంబున చరింపు చు, సదా సమయములందు భగవన్నామ సంకీర్తనంబొన ర్చుచు, పుట్టించినవానిం గురించి గిట్టించు డెప్పుడోయని మొరబెట్టుకొనుచు కొండొక కాలంబున కాసన్నకాలుండై స్మృతిదప్పి మృత్యుముఖంబునఁబడిన నీశ్వరకింకరు లరు దెంచి, జీవుని ప్రకృతినుండి విముక్తుంజేసి నానావిధ పుష్ప మాలాలంకృతంబగు విమానంబు నెక్కించుకొని ఆదిత్య

అగ్నిదిన పూర్వపక్ష షాణ్మాసోత్తరాయణ మాస సం
వత్సర వాయు సుధాకర వరణలోకంబులఁ జూపుచుండ
జీవుం డాయా లోకాధిపతులచే బూజింపబడుచు, క్రమ
క్రమంబుగా బ్రహ్మాండ కటాహంబు నతిక్రమించి మూల
ప్రకృతిని దాటి యవ్వల నానా జన్మార్జిత సుకృత దు
ష్కృత విభాగ కరణ సమర్థంబగు విరజానదిం స్నానమాడి
నిర్ధూతసకలకల్మషుండై, యనంతుసాయూజ్య మొందియవ్వల
తిల్యవనాదుల బ్రవేశించి సర్వగంధుండై, సకలాప్సర
యువతీగణ స్తోత్రుండగుచు, క్రమ క్రమంబుగా పునరా
వృత్తి రహితంబును అయోధ్య అపరాజితయను పేరులం
బ్రసిద్ధంబగు మోక్షస్థానంబునొందు నచుచుండ, పుండరీక
నిద్రించుటయు ప్రాణుండును శయనించె తదనంతరంబు

క॥ నెలతకు సుఖముగ తొమ్మిది
నెలలేగెను పిదప నొక్క ♦ నెలలో శుభ ని
ర్మల లగ్నమందు ఖేచర
ముల దృష్టులు నక్రమముగ ♦ ముందుకు నడువన్.

✱ లం పుండరీకకు కుమారు డుదయించుట. ✱

॥ బాలుడుబుట్టె నాసతికి ♦ బాలసుధాంశు మయూఖలీలలన్
బోలిన జూచి యాశ్రమము ♦ నూరియలంకరణంబు జేసె నిం
కేలనె పుండరీకముని ♦ యింకును మెచ్చుచు సంతసిల్లి రెం
తోలలిగాంచ రాముని పృ♦థుప్రతిభాసిలుచుండెనివ్వెరన్

గీ॥ అనుచు నాశ్రీమమందుండు ♦ నతివలెల్ల
మెచ్చుకొనిచుండిరెంతయో ♦ నచ్చెరువుగ
పిదప ప్రాణుండు జూచె నా ♦ పిన్నవాని
రాముని౯గన్న దశరథ ♦ రాజు పగిది, ౭౹

వ॥ ఇట్లు సంతోషస్వాంతుండై, ప్రాణుడు శ్వశురమందిరంబున
కొక సంతేవాసికి శుభపత్రిక వ్రాసియిచ్చి పంపిన బాలకు
డా పత్రికగొని వసిష్ఠాశ్రమంబుసొచ్చి పత్రికనొసంగిన జదివి

* ౭౦ వసిష్ఠుడు దౌహితృని నామకరణంబు సేయవేగుట. *

క॥ ఆవార్త దెలిసినంతనె
భావంబున సంతసిల్లి ♦ భార్యయు సుతులు౯
సేవక బృందము శిష్యులు
సేవింప౯ వచ్చెనిక వ ♦ సిష్ఠుడు వేడ్క౯. ౭౮

గీ॥ వచ్చి గురుదేవుగాంచి తా ♦ వందనంబు
జేసి క్షేమంబునడిగె సు ♦ స్వీయ గృహము
తల్లిదండ్రులు జేరిన ♦ తనయ యుబ్బి
పుత్రు దండ్రికి జూపె దౌ ♦ హితుడనుచు. ౭౯

వ॥ పిమ్మట పదునొకండవ దివసంబున సకలఋషిగణ మేతెర
బ్రాహ్మణసమూహంబు బారులుదీర్చి కూర్చుండ జాత
కర్మ నిర్వర్తించి నామకరణంబునకై మాతామహుడగు
వసిష్ఠుసన్నిధి కా బాలకుని గొంపోయి నమస్కరింపజేసిన

## ద్వితీయాశ్వాసము.

క: మతిమంతుఁడు గుణవంతుఁడు
ద్యుతిమంతుం డనెడు పేర • దోర్బలయుతుఁడై
సతతము వర్ధిలు విద్యా
న్వితుఁడై చరియించుఁగాక • విష్ణువ్రతుఁడై. ౯౧

గీ॥ అనుచు నిట్టుల పేర్వెట్టి • యపుడె తాను
నాశ్రమంబున కేగెను • నతివతోడ
కొదువవారందరిని తన • కొదువలేని
మన్ననల జేసి పంపె సం • పన్నుఁడనగ. ౯౨

* శ్రీ ద్యుతిమంతుని బాల్యాది వర్ణనము *

ఇట్లు నామకరణానంతరం జిత మన్మథస్వరూపుఁడు దేవ బ్రాహ్మణదత్త వరప్రభావజాతుండగు ద్యుతిమంతుండు కొంత కాలంబునకు దినదిన ప్రవర్ధమానుండై మాతాపితరుల కత్యంత సంతోషంబు జేకూర్చుచు శైశవ క్రీడావిశేషంబుల కాలంబు గడుపుచుండ నైదవ వత్సరం బాగతం బగుట జేసి ప్రాణుండు కేశఖండనాక్షరాభ్యాసంబుల నెరవేర్చి గర్భాష్టమంబున మౌంజీవ్రతం బాచరింప సంకల్పించి బ్రహ్మమానస పుత్రుఁడగు నారదమహర్షిచే ముహూర్తంబు నిశ్చయింపం జేసి తద్వర్తమానంబు వసిష్ఠునకు తెలియబరచిన నతండు సకల శిష్యజనములు వెనువెంట నంట విధాతాశ్రమంబు సొచ్చి నిఖిల ఋషిదేవతాగణంబులచే నిండియుండు శోభన మంటపమున నాల్గుదినంబులు

తత్కార్యంబు నిర్వర్తించి ప్రయాణంబయిన నమ్మహా
ముని నుచితరీతి సత్కరించి ప్రాణిం డిట్లనియె ౧౩

* ౧౧ ప్రాణుడు ద్యుతిమంతుని వసిష్ఠునితో బంపుట. *

ఉ॥ నాకొసమస్తశాస్త్రముల ♦ నారతమ్ముం దెలియంగ జెప్పి మేల్
జేకొనజేసి యంతట వి ♦ శిష్ట చరిత్రను కూతు నివ్వగా
మీకరుణా ప్రభావతను ♦ మేలగు పుత్రుడు నాకుగల్గె న
స్తోకమనీష నీవటుని ♦ దోడ్కొనిపొందు తవాశ్రమంబుకుంక

క॥ బాలకు డీతని శిష్యుని
పోలిక శాస్త్రంబులెల్ల ♦ బోధించి మహా
శీలము గౌరవభావత
నేలుండని బల్కు నాల ♦ కించి మరి యనెక. ౧౪

* ౧౨ ద్యుతిమంతుడు వసిష్ఠునివద్ద విద్యల నభ్యసించుట. *

వ. మీ యిష్టప్రకారం బట్లే కానిండని యా బాలకుని తన
వెంట నిడుకొని యాశ్రమంబు ప్రవేశించి క్రమ క్రమం
బుగా నుదాత్తానుదాత్తాది సర్వభేదంబులు గలుగు
వేద చతుష్టయంబును, సూత్రవార్తికాది భేదయుతంబగు
వ్యాకరణంబును, అతివ్యాప్త్యవ్యాప్త్య సంభవాది వస్తు
నిచయ విమర్శకంబగు న్యాయంబును, ముహూర్త జాతక
శకునాది భేదయుతంబగు గణితశాస్త్రం బనంబరగు జ్యో
తిషంబును, వృత్త్యనుప్రాస యమకపాక వృత్తి వృత్తి రీతి
శృంగార శయ్యా రసగుణధ్వని శ్లేషోల్లేఖా సందర్భ గర్భితం
బులగు ఛందోలంకార శాస్త్రంబులును, యుక్తాయుక్త

జ్ఞానపూరితంబగు శిక్షయు నియతాది విశిష్ట నిరుక్తియు, చతురశీతి బంధభేద వశీకరణ మంత్రౌషధీ కళాస్థాన చుంబన పరిరంభణాది లక్షణోద్బోధకంబగు రతిరహస్యంబును, వశ్యాకర్షణోచ్చాటన మారణభేదనస్తంభనశక్తి పుష్టి ప్రయోగోప సంహరణ క్రియాలక్షణ లక్షితంబగు మంత్రి శాస్త్రంబును, మంద్రమధ్యమతార శృతివిశ్రుతానులోమ విలోమ స్వరతాన సంతాన గుంభన గంభీరఘననయ దేశీయ జాతిస్థాయి మూర్ఛనాస్థానయుతంబగు గాంధర్వంబును, బ్రహ్మాస్త్ర అతిబల మహాబలా ద్యుపసంహార ప్రయోగంబగు నస్త్ర విద్యయు, సకలేతిహాసయుంతబగు భారత రామాయణంబులును, ధర్మప్రబోధకంబులగు ధర్మశాస్త్రంబులు మొదలుగాగల విద్యలనెల్ల నేర్పించి సర్వకారణ భూతుండగు సర్వేశ్వరుని విభవావతార కథా సంయుతంబులగు భాగవత పద్మపురాణ విష్ణుపురాణంబుల జెప్పిన మాతామహుని యాదరణ బుద్ధి కత్యంతానందయుతుండై ద్యుతిమంతుం డిట్లనియె గీ॥

శా॥ ఎన్నో సార్లు దశావతారముల తా ♦ నెత్తెఁగదా యట్టి శ్రీ
మన్నారాయణు సత్కథాశ్రవణమే ♦ మజ్జన్మసార్థక్యమై
మున్నేగాకను భావిపాపములను ♦ న్బోకార్చు నట్లౌట మీ
కన్నఁ జెప్పఁగ వేరులేరు ఇక నా ♦ కా సత్కథల్ జెప్పవే.

వ॥ అంతే కాక పరవ్యూహ విభవాంతర్యా మ్యర్చారూపము

లనం బరగు పంచావస్థలీశ్వరున కెందుకుగలుగవలసివచ్చె
నదెల్ల సవిస్తరంబుగా నెరిగింపుమన వసిష్ఠుం డిట్లనియె.

* శ్రీ పరత్వాది వర్ణనము. *

క॥ పరమనగ వ్యూహమనగా
నరయంగా విభవమనగ ♦ నంతర్గతుడై
చరియించి లోకమందున
పరవిగ నర్చావతార ♦ సంగతి నొందున్. ౫౯

వ॥ ఇట్లు స రుండై దవస్థలనొందు. తద్విధానంబు దెలి
ద నాకర్ణింపుము. ౬౦

క॥ పరమన జేతనకృతమహా
దురితములన్ జూచి కోప ♦ తూలిత హృదయాం
తరుడై పరమపదంబున
సురగేశ్వరు పీఠమందు ♦ నుండును సతము. ౬౧

గీ॥ అతని కోపంబు దెలియక ♦ నజ్ఞులయిన
జీవనిచయంబు దుర్వృత్తి ♦ జెనుచునుండ
ప్రీతిగల్గిన శ్రీలక్ష్మి ♦ ప్రేరితాత్మ
డగుచు వ్యూహంబునకు వచ్చు ♦ నచ్యుతుండు. ౬౨

వ॥ అట్టి వ్యూహంబు భగవంతుని యనంతావతారంబుల కా
కారణమై చెలంగియు నాల్గు విధంబులయ్యె. వానిం జెప్పెద
నాకర్ణింపుము. ౬౩

## ద్వితీయాశ్వాసము.

గీ॥ వాసుదేవాభిధవ్యూహ ♦ వర మొకటియు
దనరు సంకర్షణవ్యూహ ♦ మనగ రెండు
మొగిని ప్రద్యుమ్ననామక ♦ వ్యూహము నని
రుద్ధుడను వ్యూహ మొకటి న ♦ న్నద్ధమయ్యె ౬౮

వ॥ ఇట్లు వ్యూహచతుష్టయంబున ననేక రక్షణోపాయయుతుం డై వెంచేసియున్న సర్వేశ్వరుని చేరజాలక క్షీణాయుష్మంతులై దుష్కర్మయుక్తులగు చేతనకోటి నుద్ధరింప దయాంతఃకరణుండై విభవావస్థనొందు. అందు ౬౯

సీ॥ మత్స్యావతారంబు ♦ మహి వేదరక్షకై
కూర్మంబు వేల్పుల ♦ కోర్కెదీర్ప
కిరిరూపధారియై ♦ ధరనుద్ధరించుట
కనకాక్షుజాపుట ♦ కనక కశిపు
హరియింప ధరియించె ♦ నరసింహ రూపంబు
బలిగర్వమడప నా ♦ వామనుండు
విశ్వరక్షణకు త్రి ♦ విక్రమరూపంబు
కార్తవీర్యార్జుని ♦ గర్వమడప

గీ॥ పరశురామాభిధుడునయ్యె ♦ సరవిదాశ
రథియు రావణు బరిమార్ప ♦ రమణ కృష్ణ
రూపమే కంసదనుజ శ ♦ త్రువుల జంప
భూమిగలదోషములదోయ ♦ బుద్ధుడయ్యె
గలిగె కల్క్యవతార మా ♦ కలి నణచగ.

వ. ఇట్లనేకావతారంబుల నెత్తి ప్రహ్లాద విభీష ణాక్రూరమా లాకారాది మహాభక్తులకు స్వస్థానంబు నొసంగె మరియు ధర్మోద్ధరణంబును శిష్టపరిపాలనము నధర్మశిక్షణాం బొన ర్చె నేకాని తదితర చేతను లామూర్తి మాహాత్మ్యంబు దెలి యక తరింపలేకుండుటచే చింతించి తుద కన్నిచోట్ల వారి వారి స్వీయాఽతోప్రపతిష్ఠుండై వర్తించినం దెలియజాలక యున్న పిమ్మట మానవునికి స్వాధీనుండై స్వతంత్ర ముం డి లేని విధంబున స్వయంవ్యక్తమని దివ్యంబని సైద్ధంబని మానుష్యంబని చతుర్విధంబుల నాలయ గృహాశ్రమపుణ్య నదీనద ప్రదేశంబుల భక్తజనేష్ట ప్రకారంబగు మృద్దారు లోహ శిలామయ విగ్రహ (అర్చా) స్వరూపంబు నొందు నన విని ద్యుతిమంతుం డిట్లనియె. ౬౭

గీ॥ అయిన నేయాశ్రమంబున ♦ నచ్యుతుండు
సేవనొసగునొ నా కిప్డు ♦ జెప్పుమనగ
తాతయాటకు నిట్లనె ♦ తరుణిసేవ
మొదలు జేసియు పిదప నా ♦ ముచ్చటడుగు. ౬౮

❋ ౧౭. ద్యుతిమంతు డిలుజేరి సుగంధిని పెండ్లాడుట. ❋

వ. అనిన సిగ్గుచే తలవంచి మాతామహా! తామే యిట్లుసెల వీయ న్యాయంబె? సంసారము మహాకష్టమనియు భయం కరాగాధసముద్రమనియు సెలవిచ్చితిరి. అట్టి విషయాంత రముల ప్రవేశించుటకన్న తపశ్చరణంబు మేలుగదా

యనిన విని వసిష్ఠుండు వత్సా! నీ మాతాపితరులు నీమీా దనే యాధారపడియున్నారు మరియు లోకంబున బ్రహ్మచర్యాద్యాశ్రమ చతుష్టయంబున నన్నివిధముల మేలైన గృహస్థాశ్రమ స్వీకారమొనర్చి వంశదీపకులగు తనయుల బడసి సన్యస్త సంసారభరుండై జ్ఞానయోగంబుననున్న మానవులకు సర్వేశ్వరుండు సులభసాధ్యుండు. కావున నీవు వివాహితుడవై సంతానముంబడసిన వెనుక తపశ్చరణంబు యుక్తంబనిన నల్లెయని తాతగారి యాజ్ఞబడసి యిల్లుజేరి కొంత కాలంబునకు నతిరూప లావణ్యాది సుగుణగణ విరాజితయగు సుగంధియను యువతీరత్నమును పరిణయమాడి యనంగసంగరానం దాతిక్రాంతకాలుండై యొక్కనాడు. ౬౯

* ౪౭ ద్యుతిమంతుని తపస్సు. *

కాంతన్ జూచియు నిట్టులన్ బలుకు నో ♦ కాంతామణీ నాకు యే
చింతల్ లేవు తనూజ రత్నములకై ♦ శ్రీనాథునిన్ గూర్చి నా
స్వాంతంబే తపమాచరించుటకు ను ♦ త్సాహంబుతోనుండె ర
వ్వంతైనన్ హృదయంబు దాచకను నీ ♦ భావంబు బోధింపవే.

క॥ అను భర్తను గని వనితా
మణి గద్గద కంఠమునను ♦ మగనికి ననియెన్
మునినాథ! నిన్ను బాసియు
క్షణమైన వసింపగలనె? ♦ క్ష్మాస్థలియందున్. ౭౧

వ. గీ॥ అనుచు బల్కెడి నర్ధాంగి ♦ నాదరించి
యిట్టులనిబల్కె తపమున ♦ నీశు గెలచి
సుగుణవంతుని పుత్త్రిని ♦ శుభదరూపు
గలుగువానిని బొందెద ♦ ఘనులు మెచ్చ. ౭౨

ఉ॥ అన విని హొమ్మటంచనెడి ♦ నబ్జముఖిన్ తను కౌగలించి యా
నను గొనుచుండు నంతటనె ♦ నారదమౌని ఘనుండుగన్పడన్
మనమున సంతసిల్లి నవ ♦ మల్లిక పువ్వుల పూజజేసి నా
మునిని తపంబుజేయుటకు ♦ మూలము జెప్పుమటంచు వేడినన్

క॥ నిర్జనవనమున తపమును
నార్జించుట యుత్తమంబు ♦ నచ్చట రిపులన్
నిర్జించవచ్చు నిజమిది
తర్జన మింతేనిలేదు ♦ తాపసవర్యా. ౭౪

వ. అన విని ద్యుతిమంతుండు ప్రణమిల్లి దేవా! తపశ్చరణం
బునకు విధివిధానమంతయు నీవరకే మాతామహునివద్ద
నే దెలసుకొనియుంటిని కాని మూలమంత్రము లభింప
మిచే దాని స్మీర లనుగ్రహించిన ధన్యుండనగుదునన నార
దుండు వల్లెయని యాతనితో ఘోరాటవిని బ్రవేశించి
నిస్సార సంసార తారకంబును ఐహిక ఫలప్రదంబునునగు
వ. అష్టాక్షరీ మంత్రరాజంబు నుపదేశించి యంతర్హితుం
డయ్యె నప్పుడు ౭౫

పమున్ జేసె ధరామరుండు ఘనమౌ ♦ దావాగ్ని నల్దిక్కులన్
యించెన్ మది భీతినొందకనె మ ♦ ధ్యాహ్నంబు తానొంటికా

లుపయిన్నిల్చియు సూర్యబింబమును నాలోకింపుచుండంగ నీ తప మెన్వండిల సేయలేదనుచు వేత్తల్ చాల భీతిల్లగన్.

వ. ఇట్లు నిష్ఠాగరిష్ఠుండై వేసవికాలంబు నగ కట్లాచరించి వర్షాకాలంబున సంతతధారాచ్ఛాదిత వర్షంబున నుండి తపంబు జేయుచు 22

గీ॥ అంత హేమంతకాలంబు నందు నీట
కంఠమునుదాక నిలుచుండి కఠినవృత్తి
తపముజేసెను విప్రుండు "ధైర్యముగను
పట్టుబట్టిన కార్యంబు బాగుపడదె?" 23

* 23 ద్యుతిమంతుని తపోభంగం బొనర్ప నప్సరస లేతెంచుట. *

వ. ఇట్లు లుగ్రతపం బాచరింపుచుండ నత్తపోగ్ని బయలెవ్వడలి క్రమక్రమంబుగా నింద్రాదిలోకంబు లంటుటయు దేవానీకంబులు సహించనేరక నందు నింద్రుండు క్రోధారుణిత నేత్రుండై బడుగుబాపనికి కూడా నా రాజ్యంబు కావలసివచ్చెనే? యని వాని తపోభంగంబుగావింప నూహించి వెంటనే యప్సరసాంగనల రావించి వారలతో నేడొక ఘనంబగు కార్యంబు మీవలన గావలసియున్న దన వారలు దేవా! మీ యాజ్ఞ యవశ్యాచరణీయంబు గాన నాజ్ఞయిండన నిందుండు సుందరులారా! భూలోకంబున నొక తాపసి తపంబు సేయుచున్నాడు. మీ రేగి యత్తపోవిఘ్నంబు జేసి రండన వల్లెయని మెల్ల మెల్లన

పాదవిన్యాసంబు గావింపుచు స్వర్గాదవతీర్ణలై వచ్చి నగా
రసాంగనలపై మందాకినీమలయానిలంబు సోక పాపపుణ్య
భూయిష్ఠంబగు భూలోకంబునకేగు నీ ముగుదల ముద్దు
ముఖకమలంబుల నుండు నమృతంబు లభింపదను నెపంబున
లేచిపోవు షట్పదంబులో యన ముంగురు లల్లలలాడ
సవరింపుకొనుచు సంశయాందోళితస్వాంతలై తత్తపోవనం
బు ప్రవేశించి యందలి సలిలాశయంబున మాంసభక్షి
తానేక జలచరామయ శరీరుండును, బాహ్యేంద్రియ జ్ఞాన
శూన్యుండగు ద్యుతిమంతుని గాంచి యాతని కట్టెదుట
శృంగార సంయుతానేక వీణాగాన పూర్వక లాస్యంబుల
జేయుచు చేలాంచలముల సవరింపులచే నంగసౌందర్యంబు
గన్పడ ననేక ప్రయత్నంబుల నొనర్చుచు, నెంతకాలంబు
నిరీక్షించిన నా ద్యుతిమంతుడు నిశ్చల తపోనిష్ఠ మసలుట
గాంచి విఫల మనోరథలై యాతనికి వందనం బొనర్చి త
త్తపోశక్తి కెంతయో మెచ్చుచు స్వర్గంబు జేరి పాకశాస
నుని గని సర్వవృత్తాంతంబులను దెలిపిన నతం డత్యాకులిత
స్వాంతు డగుట నాంగిరసుండు బ్రహ్మలోకంబున కేగి
మొరబెట్టుకొమ్మని మంత్రంబు జెప్ప వెంటనే దేవానీకం
బుతో సత్యలోకంబున కేగి బ్రహ్మతో నిట్లనియె. ౭౯

క॥ ఇష్టమతి తపము జేసెను
నిష్ఠుడు ద్యుతిమంతు డనెడు ♦ నీతి విదుండుర్

కష్టముబెట్టెను మము సుర
జ్యేష్ఠుండవు గాన యుక్తి ♦ జెప్పవె దేవా! ౧౦

గీ॥ అనిన విని బ్రహ్మ యెంతయో ♦ యాత్మలోన
యోచనలుజేసి మనకేమి ♦ యుక్తిలేదు
విష్ణుభక్తుండు నొరులకు ♦ వెరువ డెపుడు
వారలకు నెప్పుడేనియు ♦ బాధలేదు. ౧౧

క॥ కావున మనమందర మా
దేవేశుని యెదుట దీని ♦ దెల్పియు మన కా
యీ విధులెల్లను జెప్పిన
దేవుండును కరుణజేయు ♦ దీప్తియు గలుగన్. ౧౨

* ౪౯ ఇంద్రాదులు బ్రహ్మ సహాయంబున క్షీరసముద్రమున కేగుట. *

గీ॥ అనుచు రుద్రుని బిలిపించి ♦ యంత దెలియ
జెప్పి వెంటనె క్షీరాబ్ధి ♦ జేర నరిగి
సకల కష్టంబులొందు ని ♦ర్జరులు తాను
రాజరాజును జేరెడి ♦ పౌజువోలె. ౧౩

ఇట్లందరేకీభవించి క్షీరవారాశి గల దిక్పథంబునకు జని చని ముంగట అంతస్థ కుధర కబళనా సమర్థంబులగు నక్ర గ్రహంబులును, తరంగములబుట్టు శేష సహస్ర ఫణాదా గతంబులగు ఫూత్కార నిరంత రోత్పాదితములగు క్షీర బిందు సందోహంబులుగల నప్పయోరాశినిగని సంతోషిత స్వాంతులై యింక నారాయణుం డఖిలనిత్యసూరి బృంద

సంసేవ్యమానుండై శేషశాయియై యున్న వాడుగదాయని నచ్చెరువందుచు నిటల ఘటిత కరపుటలురై యిట్లనిరి.

1 శ్రీరమణీశయాళ చిద ♦ చిన్మయమూర్తి మహామహా జగ
త్కారణ కల్మషాంధ రవి ♦ కాల ఘనాఘన రూప వైరి సం
హారక దాసరక్షక వి ♦ నమ్రజనార్జిత పాపమోచనా
కార జనార్దనా యిపుడు♦ గావవె యార్తులమైన మమ్ములన్

ఇట్లనేక భంగుల నిలింపులు ప్రార్థింప మొర లాలకించి సాక్షాత్కరించిన సకలభక్తలోక హృదయ వాసభూతాఽకుంచితాఽకుంచిత పాదకమలుండును, శ్రీ భూ నీళాది దివ్యనారీ సేవ్యమానపాదభాగుండును, సహస్ర ఫణామణి కాంతి నీరాజిత దేహుండును, వక్షస్థలస్థిత కౌస్తుభమణి శ్రీవత్స లాంఛన గ్రైవేయహార కటకాది దివ్యాభరణ విరాజితుండును, శంఖ చక్ర కౌమోదకీ గదా ఖడ్గాబ్జ నానావిధ దివ్యాయుధ హస్తుండును, సజలజీమూత సమాన శరీరుండు నగు శ్రీమన్నారాయణుని గాంచి మైమరచియున్న నిలింపులతో మేఘ గంభీర భాషణంబుల శ్రీహరి యిట్లనియె

సేమమె సత్యలోకమున, ♦సేమమె నీరజతాద్రియందు, సూ
త్రామ త్వదీయ పత్తనము ♦ రక్షితమై దనరారు చున్నదే
యేమిటు లంద రేకముయి ♦యిచ్చటికే యరుదెంచుటెంచగా
నామది సంశయం బొదవె♦ నావలనన్ గల కార్యమెద్దియో

వ. అట్లానతిచ్చు హరివాక్యములకు మేల్కని దేవతలందరి యభిమతంబుగా విధాతముందై నమస్కరించుచు నిట్లనియె

గీ॥ స్వామి రక్షించుచునట్టి యా ♦ స్థానమందు
నున్న మాకెట్టి కీడును ♦ నుండు నొక్కొ!
కామధేనువుచే నుండ ♦ కామ్యములకు
తక్కువై యుండ దెప్పుడు ♦ నొక్కసైన. ౭౯

వ. కాని ప్రస్తుత మొక విప్రకుమారుడు దేవరను గురించి తపం బాచరింపు చున్నవాడు. తత్తపోగ్ని మా లోకంబుల దహింపుచున్నది. అద్దాని సహించలేక తమతో విన్నవించుటకై వచ్చితిమి. ఎట్లేని యవ్విప్రకుమారుని యభీప్సితము నెరవేర్చి మా బాధ నీడేర్పుమన జిరునవ్వు చెంగలింప దేవతలారా! ఆతని తపంబు చాలింపు సమయము వచ్చినది. ఇప్పుడే మీ బాధ మాన్పెద. మీరు శుభంబుగా పోయిరండని నంతర్హితుండైన. నిలింపులా హరిని ధ్యానింపుచు నెవరి లోకంబులకు వారేగిన పిమ్మట జనార్దనుండా ద్యుతిమంత తపోవనమున కేతెంచి. ౮౦

* ౨౦ ద్యుతిమంతునకు భగవంతుడు ప్రత్యక్షమై వరంబు లిచ్చుట. *

సీ॥ శంఖ చక్రంబులు ♦ శార్ఙ్గ పద్మంబులు
చేతుల నాల్గింట ♦ జెలగుచుండ
వక్షాన శ్రీదేవి ♦ వనమాల శ్రీవత్స
చిహ్నితములు నయి ♦ చెన్ను గలుగ

ముఖ సరోజంబున ♦ ముద్దుగా దిద్దిన
యూర్ధ్వపుండ్రంబెంతొ ♦ యుజ్వలింప
కరుణ జిల్కుచు నుండు ♦ కందోయి గల్గియు
దరహాసవదన మెం ♦ తయు వెలుంగ

గీ॥ నమృత రసమును జిల్కు వా ♦ క్యముల నుడువు
చుండి బ్రత్యక్షమై యనె ♦ దండిదైన
నీ తపంబున కేమెచ్చి ♦ నీకు వలయు
వాంఛితంబుల నొసగూర్ప ♦ వచ్చి తనిన. ౯౧

శా॥ ఆగంభీర సుభావ భాషణలు తా ♦ నాకర్ణనం జేసి సం
మోగంబైన శరీరకాంతి దిశలన్ ♦ యోగింప విభ్రాంతుడై
సాగించంగల యట్టి కోర్కె తబమున్ ♦ సాగించి శీఘ్రంబుగా
రాగాతీతుని జూచి పాదముల శీ ♦ ర్షం బుంచి లే చిట్లనెన్

వ. దేవా! నా జన్మ తపఃఫలంబులే యింపు సొంపారు నీ రూపు కనుంగొనుటచే ధన్యుండ నైతిని. నీవు నాబోటి పామర జనంబుల తపంబులకు మెచ్చి దర్శనం బిచ్చుట నీ యాశ్రిత వాత్సల్యత లోకం బనేకనోళ్ల బొగడుచున్నది. నీ దేదీప్యమానంబగు మంగళరూపంబును వర్ణింప నాబోటి యల్పమానవు డెంతవాడు అనుచు సంతోషంబున మేను గగుర్పాటు నొంద పాదకమలములపయిం బడి లేవకున్న న ప్పరమేశ్వరుండు దయా కలితుండై లేవనెత్తి నీ కేమి కావలయునో కోరుకొమ్మన త త్సంతోషంబున పుత్రు నడుగ మరచి యిట్లనియె. ౯౩

గీ॥ సర్వలోకంబు నీకు స్వ ♦ స్థానమునకు
జేర యత్నింతు రీశ యీ ♦ క్షితిని నాకు
లేదు గోరగ నొక్కటి ♦ లేశమైన
నీవు నివసించు తావిచ్చి ♦ బ్రోవునన్ను. ౯౮

అనవిని యచ్యుతుఁడు మన♦సారగ మేను స్పృశించి యిట్లనెఁ
ఘనసుతయుగ్మముఁ గని సు ♦ ఖంబుగ కానల కేగు భార్యతో
మనమున కిష్టమౌనటుల మా ♦ పద విచ్చెద నీకు పొమ్మటం
చన యిటుబల్కు భూ విబుధు ♦ డంబుజనాభునితోడ పిమ్మటఁ

వ. స్వామీ! మీ యాజ్ఞ జవదాట నావంటి మానవుని తరం బగునే? యీ సంసార శోకతప్తియంబున బడి దహింపు చుండి నీ మృదుపదంబు లాశ్రయించిన నన్ను మగల దుఃఖాంధకారంబున బడవేయ దలంచుట నా పూర్వజన్మ కర్మవాసనా విశేషంబని తలంచుచున్నాడ నను విప్రునిం గని దరహాసిత వదనారవిందుండగు గోవిందు డిట్లనియె. వత్సా! నీ వనిన యట్లసంసార మతి దుఃఖభాజనమైనను సం తానేచ్ఛచే దపం బాచరించినందున మొదట సంతానము నిచ్చి మద్దర్శన జనితానంద పరవశంబున మోక్షంబు గోరి తివి. గాన పిదప మోక్ష మొసంగెదనని మరియునిట్లనియె

గీ॥ నీదు పుత్త్రులవల్ల న ♦ నేక కార్య
ములును లోకంబులకు మేలు ♦ గలుగు లాభ
మంతియేగాదు నీ వంశ ♦ మఖిలకాల
మెంతయో వృద్ధి బొందింతు ♦ వింత గాను. ౯౭

వ. అనిన విని ద్యుతిమంతు డిట్లను దేవా! యీ మానన కీటక సముత్పన్నులగు బాలకులవలన లోకోపకార మేలగలుగు? నయిన దేవర సంకల్ప వికల్పనలచే ననేక కార్యములు గావే? యన విని శ్రీపతి యిట్లనియె. ౯౮

గీ॥ వరుస నున్నతుడన స్వన ♦ వాతు డనగ
కవలు జన్మింతు రందు లో ♦ కానురాగ
మును సహించక వైరాగ్య ♦ మును వహించి
యుక్తుడై కడతేరు నా ♦ యున్నతుండు. ౯౯

గీ॥ వస్త్ర ఖండంబులన్నియు ♦ వరుసజేసి
కవచముల మొదలెన్నొ సి ♦ క్కముగ గుట్టు
పనుల జేసెడి వారి య ♦ న్వయపు వృత్తి
వానిగా జేయుదును స్వన ♦ వాతు నెపుడు. ౧౦౦

వ. మరియు తద్వృత్తి కనుకూలమగు కత్తెర, గజము, సూచి, యంగుళీ ముద్ర మొదలగు పరికరంబుల నొసంగి యా తనితో నిక్కలానురూపక కార్యంబుల నెరవేర్ప జేయు చుండెద. సంశయింపకు మిది మదీయాజ్ఞ జవదాటరా దని రమారమణుం డంతర్హితుడైన ద్యుతిమంతుండు సంతోషితస్వాంతుండై తన మనోరథ మీడేరెనని దలం చుచు గృహంబు కేతేర నచ్చట ౧౦౧

* ౫౧ ద్యుతిమంతుడు తన గృహంబునకు వచ్చుట. *

తనపతి వచ్చెనంచు మది ♦ తామరసాక్షి సుగంధిపొంగి యిం పున గుదిరించి వంటలను ♦ మోదముతో తలయంటి స్వాదునీ

రున జలకంబులార్చి మరి ♦ రుచ్యపదార్థము లెల్ల బెట్టినన్
బిని తములంబు చేయుతరి ♦ దీప్తిగ నిట్లనె భార్య భర్తతో.

గీ॥ నన్ను విడనాడిపోయిన ♦ నాటనుండి
యేమిజేసితి రాకృత్య ♦ మెల్ల జెప్పు
డనగ ద్యుతిమంతు డిట్లనె ♦ హర్ష మధుర
వాక్యములతోడ వరుసగ ♦ భార్యకొగిని. ౧౦౩

వ. తా నేగినది మొదలు జరిగిన సర్వవిషయంబుల దేటతెల్ల
ముగా తెలిపి సాయంకాల మగుటయు కాల్యకృత్యంబుల
నెరవేర్చుకొని భోజనాదుల నిర్వర్తించి భగవద్ధ్యాన వ్యా
దయములతో భార్యాభర్తలు శయనించి రంత ౧౦౪

✱ శ్రీ సుగంధికి ఉన్నత స్వనవాతులను కవలుదయించుట. ✱

గీ॥ ఆ దినంబున నుండియే ♦ యతివ విష్ణు
వర మహాత్మ్యంబుతోడ గ ♦ ర్భభవమయ్యె
వరుసగా నది పదినెల ♦ లరుగుచుండ
మంచి లగ్నాన బుట్టిరి ♦ మరి కవలుగ. ౧౦౫

గీ॥ జనన మొందిన శిశువుల ♦ సారసాక్షు
లెందరో జూచి వీరల ♦ నెన్న విష్ణు
రూపముల బోలియున్నారు ♦ రూఢిగాను
యెంతధన్య సుగంధని ♦ యెంచి రపుడు. ౧౦౬

వ. ఇట్లు జనించిన బాలకులకు జాతకర్మ విధినాచరించి పెద్ద
లందరిచే నున్నత స్వనవాతులని నామకరణంబు గావించ

నబ్బాలకులు మాతృస్తన్యంబు సామాన్యంబుగాఁగుడుచుచు తల్లి యెప్పుడేని సంతోషంబుగా నత్తత్తయని జెప్ప మెల్ల మెల్లగ హరి హరి యని బల్కుచు క్రమంబుగా నైదవ వత్సరంబు ప్రవేశించుటయు నం దున్నతుండు బాల్యచేష్టలను వదలి భగవచ్చరణార్పిత చిత్తవృత్తుడై యతీత బాల్య కౌమారంబులు గలిగి యౌవనుడై నంత నైహికంబులశాశ్వతంబులని యెంచి సంత్యక్త సర్వకర్ముండై వైరాగ్యంబున తపేచ్ఛ నడవికిఁ జేరెనని జెప్పిన విని శౌనకాదులా సూతునిగుఱించి యిట్లనిరి. ౧౦౭

* ఇతి స్వనవాతుని బాల్యము. *

క॥ ఆవలి కథ స్వనవాత మ
హా విప్రుండేమి జేసె ♦ నది చెల్పుడు సం
భావితులు మీ సమంబగు
పావను లరయంగ దొరుక ♦ బహుమరె భువిలో. ౧౦౮

వ. అనిన విని సూతుం డిట్లనియె. అట్లు స్వనవాతుండు దినదిన ప్రవర్ధమాన శరీరుండగుచు నైదవ వత్సరంబు ప్రవేశించిన నంత. ౧౦౯

సీ॥ ఆటలు నాడుచు ♦ నచ్యుతా యని బిల్చు
పద్మనాభుని నెంచి ♦ పండుకొనుచు
మాధవా యని బిల్చు ♦ మాటికి మాటికి
నిద్రించి స్మరియించు ♦ నీరజాక్షు

ప్రీతి నిమేషంబున ♦ పరమేశు వీక్షించి
చిత్తాన సౌఖ్యాన ♦ చిత్తు మరచు
నాటలకై పిల్ల ♦ లందరితో గూడి
గోవిందు నాటల ♦ గోరి యాడు

గీ॥ అత్తయని తల్లి జెప్పిన ♦ నంబుజాక్షు
యనుచు బల్కను విశ్వంబు ♦ నంత నతని
కన్నులకు విష్ణురూపున ♦ గనబడంగ
నితర మేటికి నాకంచు ♦ నెంచుచుండు. ౧౧౦

గీ॥ అక్షరాభ్యాస మాతని ♦ కనువుగాను
జేసి పంపిన నచ్చట ♦ చిన్న పిల్ల
లందరిని జేరి యిట్లను ♦ నచ్యుతుండె
సకల విద్యాస్వరూపంబు ♦ జదువు డింక. ౧౧౧

గీ॥ అనిన వారంత పలకల ♦ నచట విడచి
చెప్పు డీవిద్య మాకిదే ♦ శ్రేయ మనుచు
పలుకు బాలురకును స్వన ♦ వాతు డిట్లు
జెప్పెను రమేశు చదువుల ♦ చిత్త మలర. ౧౧౨

గీ॥ భక్తుడైనట్టివానికి ♦ వశుడుగాడె
యాటలాడించు చిత్రంబు ♦ లన్నివిధుల
భక్తిగల్గిన రండింక ♦ భజన జేయు
డనుచు హరికీర్తనల్పాడు ♦ నందముగను. ౧౧౩

వ ఇట్లు బాలురకు బోధించి పలకల నొక మూలకు బెట్టించి
స్వనవాతుండు భగవత్కీర్తనలం జెప్పుచుండ బాలురు

చదువుచు పరమేశ్వర ధ్యానాసక్తులై యున్న నుపాధ్యా యుం డేతెంచి వారలం గని కుపితస్వాంతుడై స్వనవాతుని బిలచి నీమూలకముగా నీ పిల్ల లెల్లరు చెడిపోవుచున్నారు ఇదేమి యన్యాయమను గురునితో నన్నిదెలసిన మీ రిట్లు కోపగించుట పాడిగాదు. సర్వాక్షర స్వరూపుండగు ము రాంతకుని యనుగ్రహమున్న నెన్నెన్ని విద్య లభ్యసిం పక యే వచ్చునని నిర్భయంబుగా వచించు బాలకునిగాంచి యినుమడించిన కోపంబున నాచార్యులు మూర్ఖా! నీ వనంతనామ స్మరణావేశంబున సాధించిన విద్య లెవ్వియో వాటిని దెలుపుమనుచు దండించుచున్న నద్దారకు డతి మృదుమధుర స్వరంబున పాణిని సూత్రముల జదివిన నాశ్చర్యాన్వితుండై తండ్రికడకు గొంపోయి నిజవృత్తాం తంబు నెరిగించిన నాతడు చేయునదిలేక యయ్యుపాధ్యా యునకు గురుకట్నం బొసంగి పంపిన కొన్నినాళ్లకు గర్భా ష్టక మవసన్న మగుటచే నుపనీతుని గావించి గురుకులా శ్రమంబు చేర్ప ప్రయత్నింపుచుండు నంతలో. ౧౧౮

* ౯౮ ద్యుతిమంతాశ్రమమునకు కౌండిన్యస మహర్షి యేతెంచుట. *

కౌండిన్యర్షియు వచ్చి గాంచెను మహా॰ కాంతిచ్ఛటా భాసితుః
చండాంశూన్నత తేజునిః హరి నిజే॰ చ్ఛ ప్రోద్భవుఃః సర్వవి
ధ్యండాంతర్భవ జీవ సంతతికి సా॰ హాయ్యంబునుం జేయు బా
లుండౌ నా స్వనవాతునిః గుణిని త్రై॰లోక్యస్తోత్రసంచారునిః

వ. అంత ద్యుతిమంతుండు. ౧౧౬

గీ॥ అతిథి పూజల జేసియు ♦ వాప్త వృత్తి
భక్తిఁ గొనిన తమపరిత ♦ తృప్తుగాంచి
గురుకులాశ్రమ మెపుడీయ ♦ కొనతగు తరి
యనగ ద్యుతిమంతు డిట్లనె ♦ నతనితోడ. ౧౧౭

ఉ॥ ఎచ్చటికంపు చోనితడు ♦ నెప్పటికప్పుడె యూర్ధ్వపుండ్రముల్
మచ్చిక కేశవార్చనము♦మానసపూజలు సల్పుచుండు వారి
చ్చిన పాఠముల్ జదువ ♦ డేమియొనర్చినమైచె యుచ్చ మీా
రిచ్చటి కేగుదెంచుటయు♦నీశ్వరుసత్కృప యంచునెంచెదన్

క॥ మీారాక పావనంబై
పేరాశయు గల్గె గాన ♦ ప్రియపుత్త్రు నికన్
మీారే వెంబడి గైకొని
ధీరాన్వితు జేసి శంక ♦ దీర్పవె యనఘా. ౧౧౯

* { ౫౫. కౌండిన్యుడు తన యాశ్రమంబున స్వనవాతునికి విద్యలం జెప్పి పంపుట. } *

గీ॥ అనెడు ద్యుతిమంతు మాటల ♦ కలరి యట్లు
లేయటంచును స్వనవాతు ♦ డే నడువగ
స్వాశ్రమంబును జేరియు ♦ సకల శిష్య
జనులతోఁ జేర్చె నాతని ♦ సంతసమున. ౧౨౦

వ. ఇట్లు బాలురతోఁ గూడిన స్వనవాతుం డనుదినంబు ౧౨౧

సీ॥ తొలిఝామునను లేచి ♦ పలుమారు కేశవా
యని యెంచి స్నానంబు ♦ వాచరించు

నూర్ధ్వపుండ్రము బెట్టి ♦ నొనరించు సంధ్యల
నా వెన్క శ్రీహరీ ♦ యనిదలంచు
దోడిబాలకు లంత ♦ గూడి విద్యల నేర్చు
కాలములో హరిఁ ♦ గాంచి నవ్వ
గందమూలంబుల ♦ ముందర బెట్టిన
జీవేశ గొనుమని ♦ చేతులొగ్గు
గీ॥ నెపుడు జూచిన మాధవు ♦ నే స్మరించు
పనులు జేయు నెపంబున ♦ వనము కేగి
చెట్లబూజించు నేమన్న ♦ శ్రీశు డిందు
గలటంచని బల్కును ♦ ఘనుని మాడ్కి. ౧౨౨

వ. ఇట్లు కొంత కాలంబు గడచిన న త్తపోధనుం డొక్కనాడు ప్రాతఃకాల తపోదీక్షానంతర మీ బాలకుని జేరబిలచి వత్సా! నీవు సర్వకారణభూతుడగు సర్వేశ్వరకృపాలబ్ధుడవు గావున నీ కేవిద్యలైన నవలీలగా వచ్చును. కాని మంత్రమే గాని విద్యయేగాని గురునిచే నుపదేశింపబడుట యుత్తమ లక్షణంబు. గావున నీకా రహస్యంబుల నుపదేశించెద వినుమని సకల విద్యారహస్యంబుల జెప్పి మంత్రరాజంబగు యష్టాక్షరి నుపదేశించి యింక నీ వింటికేగి గృహస్థాశ్రమ స్వీకారంబు గావించి వంశాభివృద్ధి గాంచుమని దీవించి పంపిన నాచార్యానుజ్ఞాతుండై యా స్వనవాతుండు భగవన్నామ స్మరణావేశంబున నున్మాదునిం బోలి నైమరచి గృహంబునకు వచ్చుచున్న సమయంబున ౧౨౩

* గీ|| ఇలు జేర జనుచున్న స్వనవాతునికి హరి కట్లు పరికరము లిచ్చుట *

సీ|| కోటిసూర్య ప్రభా ♦ పాటి సుదర్శనా
ఖ్యాత చక్రం బొక ♦ చేత వెలుగ
అరిభార్య గర్భంబు ♦ నవియగ రొద జేయు
పాంచజన్యం బొక్క ♦ పాణి వెలుగ
గద నొక్క చేతిలో ♦ కంజాత మొకచేత
నింపుగా ధరియించి ♦ సొంపుమీర
గరుడునిపై నెక్కి ♦ గగనమార్గంబుగా
శ్రీరమేశుండు తా ♦ జేరవచ్చి
గీ|| యెదుట నిల్చిన నాతని ♦ హృదయ మెంతో
పేదవానికి ధనము ల ♦ భించినట్లు
కన్నులకు గానబడిన వి ♦ ద్వన్నుతుండు
చేతులెత్తి జోహారుల ♦ జేసె మిగుల. ౧౩౮

గీ|| వాసుదేవాయ తే నమో ♦ భవ్యరూప
పుణ్య రూపాయ తే నమో ♦ భువన విదిత
శ్రీనివాసయ తే నమో ♦ చిద్విలాస
భక్తరక్షాయ తే నమో ♦ పరమ పురుష. ౧౩౯

గీ|| శంఖచక్ర గదా పద్మ ♦ శార్ఙ్గములను
చేత ధరియించి భక్తుల ♦ చేటులడచి
ధర్మరక్షణ జేయగ ♦ దలచి నట్టి
హృదయ మెప్పుడు క్షేమాన ♦ మెదలుగాక.

వ. ఇట్లు నుతించు స్వనవాతునిం గని హర్షితస్వాంతుడై వత్సా!

వినుము. ఇచ్చటికి కనతి దూరంబున మునిపల్లెగలదు. అందు సోమశర్మయను విప్రోత్తమునకు ననన్యరూప లావణ్యావతి యగు మానవతియను నొక తనయగలదు. నీ వచ్చటి కేగి నంతనే తన పుత్రికను నీకిచ్చి వివాహంబు గావించు. పిమ్మట భార్యాసమేతుండవై నీ యాశ్రమంబు ప్రవేశించి నాయం దలి భక్తిశ్రద్ధలతో మెలంగుము. మరియు కుట్టుపనికి దగిన పరికరము లివిగో గొని వీటితో కవచాదులు గుట్టి మహాత్ముల కిచ్చుచుండుము. ఇదియే నీ కులవృత్తియని కత్తెర, గజము, సూచీ, అంగుళీ ముద్ర సూత్రంబునకు హేతుభూతంబైన కార్పాసబీజంబులనొసంగి యంతర్హితుం డైన మునికుమారుండు భగవద్వాక్యములకు సంతసించి వెంటనే మునిపల్లె కేగ ౧౨౭

* ౨౭ స్వనవాతుడు మానవతిని పెండ్లియాడుట. *

క॥ సోమేశు డితని జూచియు
సామాన్యుడు గాడితండు ♦ సర్వేశ్వరుడో
నా మానవతికి దగునని
ప్రేమను యెదురేగి యతని ♦ ప్రీతుని జేసెన్. ౧౨౮

వ. ఇట్లతిథిపూజా సత్కారానంతరం గృహంబునకు దోడ్కొని వచ్చి యుచితాసనాసీను గావించి యిట్లనియె. ౧౨౯

ఉ॥ ఎవ్వరు మిమ్ముగన్న మహా♦నీయులువారల పుణ్యమైన పే
ళ్లెవ్వి? తమంత తాము నిట♦ కెందుకు వచ్చితి రింతదూర మీా

కివ్వనమందు కాదగిన ♦ చెద్దియొ చెల్పుడు మా కటన్న నా
మవ్వపువాక్యవృత్తి విని♦మానసమందు హరిం దలంపుచున్

వ. ఆతనితో స్వనవాతు డిట్లనియె. ౧౩౧

గీ॥ గురుకులాశ్రియణముజేసి ♦ కూర్మి విద్య
లన్నియును నేర్చి యింటికి ♦ నరుగుచుంటి
త్రోవ మిమ్ముల జూచియు ♦ బోవదలచి
వచ్చినాడను వేఱొండు ♦ వాక్య మేల. ౧౩౨

వ. ఇంతలో నాతని కుమారియగు మానవతి ౧౩౩

గీ॥ పూలదండలు చే నల్లి ♦ పూవుబోడి
తండ్రి కిచ్చెడు నెపమున ♦ దాపు జేరి
యతివ జూచెను స్వనవాతు ♦ నందగాని
నెంచ రోహిణి చంద్రుని ♦ గాంచినట్లు. ౧౩౪

వ. ఇట్లొండొరులు జూచుకొని తమ చూడ్కులతోనే ప్రథమ పరిచయము గావించుకొని తమ మనంబుల మెచ్చుకొను చున్నట్లు నోరచూపుల జూచుకొనుచుండ సోమశర్మ వా రలగని సంతసించి తన పుత్రికను లోని కనిపి బాలకుని తో వత్సా! మదీయ పుత్రి యవివాహిత నీ విప్పుడు గృ హస్థ ధర్మ మవలంబింపవలసిన కాలము గాన నిబ్బాలిక నుద్వాహమాడి కన్యాద్వితీయుండవై యింటికేగుమన వల్లె యని నుల్లంబు పల్లవింప భోజనాదు లొనర్చి పెద్దల రా వించి లగ్నము నిశ్చయింప జేసి తచ్ఛుభముహూర్తమున కన్యాదానం బొనర్చి పుత్రిక నల్లునితో సాగనంపిన వారలు

స్త్రీయాశ్రమంబు జేరి మాతాపితరులకు నమస్కరించి జరి
గిన వృత్తాంతంబు నెరింగించిన వార లుత్సహించి రంత

* ఇరా స్వసవాతుడు కులవృత్తి నొనర్చుట. *

గీ॥ దారమునకును హేతు భూ ♦ తంబునైన
ప్రత్తివిత్తుల విత్తి క ♦ బంధము లిడి
పెంచతరువయ్యె దానిచే ♦ వెడలు దార
మునను కుట్రపు పనిజేయ ♦ బూనియంత. ౧౩౬

సీ॥ మాధవా కేశవా ♦ మమ్ము గాపాడవే
యని వస్త్రముల జీరు ♦ హర్ష మొదవ
శ్రీహరి మురహారీ ♦ సేవకునిం గను
మని కుట్టు వస్త్రముల్ ♦ పనితనముగ
గోవింద శ్రీకృష్ణ ♦ కోపగింపకుమని
కుట్టినవాటిని ♦ కుదురుపరచు
భవభయ హారనామ ♦ భండన రిపు భీమ
యని కవచంబుల ♦ మునులకిచ్చు

గీ॥ నెల్లకాలము లందున ♦ నుల్ల మలర
దలచు శ్రీశుని పూజల ♦ నెలమిజేయు
వరుస శిష్యుల కెల్ల క♦ వచపుపనుల
నేర్పుచుండగ గర్భము ♦ నెలతదాల్చె. ౧౩౭

గీ॥ గర్భిణీ పతిజేసెడి ♦ కార్యములను
జేసి సర్వేశు గొలుచుచు ♦ చిత్తమందు
నున్న పదినెలల్ నిండిన ♦ కొన్ని నాళ్లు
గడువ పుత్రుడు జన్మించె ♦ ఘనముగాను. ౧౩౮

* ౫౯ మానవతికి నాగరీకుం డుద్భవించుట. *

వ ఇట్లు జన్మించిన పుత్రునికి పదునొకండవనాఁడు జాతకర్మఁజేసి నామకరణంబునకై యువతీనం బాలోచింపుచుండ కొందరు నవనాగరికత లిట్లని రీతడీకాలపువాఁడు. కావున నాగరీకుం డని నామకరణంబు జేయుడన నంద రట్లే యంగీకరించి రంత యష్టమవర్షంబున నుపనయనంబు గావించిన

* ౬౦ నాగరీకుని వృత్తాంతము. *

చ॥ ధరణిని నాగరీకుడు య♦ధావిధి బాల్యమునందు నుండి తా
గురుకులవాసమేగి యట ♦ కోరినవిద్యల నెల్ల నేర్చి సం
బరముగ పెండ్లియాడమది♦ మోహము జెందియ నేక దేశముల్
దిరిగి యనంతరంబు నొక ♦ దేశము జేరెను ప్రేమతోడుతన్

* ౬౧ నాగరీకుడు విమలను వివాహమాడుట. *

వ. ఆ దేశంబునగల కల్యాణ పురంబున విమలాదేవి యను నొక తరుణీరత్నమును గాంచి మోహించి తన్మాతాపితృల విచారింప వార లంగీకరించి శుభముహూర్తమున వివాహంబు గావించి తమ కేకైక పుత్రికయగుటచే సర్వంబు ధారాదత్తంబుగా నొసంగి యల్లునితో నిట్లనిరి. ౧౪౧

గీ॥ లేరు పుత్రులు మాకింక ♦ లేరు బాంధ్వు
లెవ్వరును లేరు యీ సిరి ♦ నేలుటకును
కూతు రొక్కతె యగుటచే ♦ కోర్కెదీర్ప
నిచ్చ టేయుండి సౌఖ్యాన ♦ నేలుకొనుము. ౧౪౨

వ. అని జెప్పి సర్వంబు నాతని స్వాధీనంబు గావించి బిడ్డకు సంసార ధర్మంబులును పతివ్రతా లక్షణంబులు బోధించి భార్యాభర్తలు ధర్మారణ్యంబు ప్రవేశించి తపోదీక్ష నవలంబించి రనుటయు ౧౪౩

* ఆశ్వాసాంతము. *

చ॥ నరనుత ధీర వీర గురు ♦ నందన పూజిత పాదపల్లవా
కరివరదా సనాతన వి ♦ కార విదూర రమాహృదబ్జ బం
ధుర కలహంస భక్త పరి ♦ తోషిత వేష సముద్రగేహసుం
దర దరహాస చంద్రముఖ ♦ దానవ వర్జిత వేంకటేశ్వరా.

* భద్రిక వృత్తము. *

సత్యవాక్య ధురంధరా ♦ నిత్యకృత్య మహోదయా
ప్రత్యవాయ విదార యా ♦ దిత్యతేజ జనార్దనా. ౧౪౫

గద్య

ఇతి శ్రీమదలర్మేల్మంగానాయక వేంకటేశ్వర పాదారవింద
ధ్యానాసక్త కౌండిన్యసగోత్ర పవిత్ర పాపయాఖ్య
పుత్ర కనకమాంబా గర్భశుక్తి ముక్తాఫల
పూర్ణానంద వాడపల్లి ఆగయాఖ్య
రాజయోగి ప్రణీతంబైన మేరు
వంశ పురాణంబునందు
ద్వితీయాశ్వాసము
సంపూర్ణం
శ్రీ వేంకటేశ్వరార్పణమస్తు.



శ్రీ వేంకటేశ్వరాయనమః

# మేరువంశ పురాణము

## తృతీయాశ్వాసము

సాధ్వీశ్వర సుగుణా
వాసా వాసవ ముఖస్తు ♦ వా సంకర్షణ వి
శ్వాస త్రిలోక నిర్మల
దాసావన వేంకటేశ ♦ ఘనసంకాశా. ౧

వ. అవధరింపుడు శుకయోగి పరీక్షిన్నరేంద్రున కిట్లులనియె. నాగరీకుండు శ్వశురదత్త సంపన్నుండై ౨

క॥ అంతట కులవృత్తిని తా
నెంతో పెంపొందజేసి ♦ యింపుగ వలువల్
స్వాంతముగ గుట్ట పెద్దలు
సంతసమున దీసుకొనిరి ♦ చలిబాధలకై. ౩

* ౬౨ విమలాదేవికి ఛండికయను కూతురు గలుగుట. *

చ॥ ఇదియిటులుండ సద్మమున♦నెన్ని దినంబులో విప్రపూజలున్
మదవతి జేసి యట్టులనె♦మాసము లెన్నియొ యొంటిపూటనే

కుమారుగ భోజనంబుగొని♦కొన్ని దినంబులు భక్తియుక్తిగన్
కుధరకేశాలయార్చనకు ♦ కూర్మిగబోవును నిష్టసిద్ధికై. ౮

గీ॥ తపము జేసిన రీతిగ ♦ తరుణిపైన
నీలకంఠుని కృపసోకి ♦ నెలయుదప్పె
పేదవానికి దొరికెడు ♦ పెన్నిధివలె
నంబపోలిక యొకబిడ్డ ♦ యవతరించె. ౯

క॥ జనియించిన బాలకు తా
మొనరించిరి బారసాల ♦ నుత్సాహముతో
వనితా మణులిల ఛండిక
యనుచున్ బేర్పెట్టి రప్పు ♦ డందరు మెచ్చన్. ౧౦

వ. ఇట్లు కొన్నినాళ్లు గడచిన పిదప. ౧౧

❋ ౬౩ ఛండిక బాల్యము. ❋

ఉ॥ బాలిక నెప్పుడున్ గనిన ♦ పార్వతిశంకరులన్ దలంచు నా
బాలికలంద రాటలకు ♦ వచ్చెదవా యన వత్తునంచు తా
మేలుగ చిన్నబొమ్మల న ♦ మేయత ఛండిక నీలకంఠులన్
లీలగ పేర్లుబెట్టి నవ ♦ లీలగ పెండ్లినిజేయు వాటికిన్. ౧

వ. ఇట్లబ్బాలిక పార్వతీపరమేశ్వరులపై మనస్సునుంచి యా
డుకొనుచుండ క్రమంబుగా యౌవన ప్రాదుర్భావంబుతో
బాటు ప్రేమబీజ విన్యాసంబగుటం జేసి సకల లోకేశుడగు
నీశ్వరుని ప్రేమించుటయు. ౨

ఉ॥ బాలిక లందరున్ విడచి ♦ బారిన నొక్కతె యీశుజేరి తా
నేల సమస్కరించి కరు ♦ ణించుము నాపతివంచు నమ్మితిన్
బాలికనంచు నా మనవి ♦ పాలనజేయక నూరుకొందువా
శీలము నీకొసంగితిని ♦ జేయ తదన్యుల సేవ యెప్పుడున్.

వ. అని ప్రార్థించి నిమీలిత నేత్రియై గంధపుష్పాదుల పూ
జించి నిటలతట ఘటిత కరపుటయై యిట్లనియె. ౧౧

ఉ॥ నమ్మితి నిన్ను భర్తవని ♦ నా మనమందున లేరెవారు నీ
సొమ్మునుగాన వీడకుము ♦ శూలి యదెట్లులనన్న నీవు పె
ద్దమ్మను బెండ్లియాడెదువి♦ధంబున నన్ను ననుగ్రహించుకా
మమ్మజయించినానని యు♦మాధవబల్కగబోకుమెప్పుడున్

వ. అని పల్కి పులకితగాత్రియై యిట్లని స్తుతియించె. ౧౩

— దండకం —

శ్రీపార్వతీచిత్తచోరా నిరాకార వీరాధివీరా జగజ్జైత్ర భక్తైకరక్షానుదీక్షా నిన్నున్ జేరి సర్వంబు నీకిచ్చినానన్న భక్తాగ్రణిన్ బ్రోచు భారంబు నీదే కదా అట్లు కాలుండు తావచ్చి పాశంబులన్ వైచి గొంపోవ నున్నంత నీరూపమున్ కౌగిలిన్ జేర్చు భక్తున్ మృకండాత్మజున్ బ్రోచి తద్ధర్మజున్ జూచి శిక్షింపవే? తొల్లి దక్షుండు ద్వేషించి యజ్ఞంబుకున్ బిల్వ రాకున్న నీధర్మపత్నియౌ దాక్షాయణీదేవి తాగన్నయిల్సేర తారమ్మనన్ వద్దనన్ మూర్ఖమార్గంబునన్ బోవ విఘ్నేశుడున్ వెంటరాగన్ దిరస్కారమున్ బొంది తానచ్చటన్ భస్మమైనంత నా

వార్త దేవర్షి జెప్పంగ క్రోధానలజ్వాల లుప్పొంగగా| జూట మున్ దీసినన్ రౌద్రమూర్త్యైన భద్రుండు జన్మించినన్ యజ్ఞ విధ్వంసమున్ జేసి రమ్మన్నవాడేగి విధ్వంసమున్ జేయ సంతోషివైయుంటివో స్వామి నీమూర్తితో ద్వేషమున్ గొన్న వా డెన్నగా మానవుండౌనె వేనిన్ను వర్ణింప నేనెంతదానన్ పరే శా మహేశా శివేశా నమస్తే నమస్తే నమస్తే నమః. ౧౪

గీ॥ ఇట్లు ప్రార్థించి యింటికి ♦ నేగినంత
కొన్నివాళ్లకు నాగరీ ♦ కుండు బిడ్డ
దరినిజేరియు నిట్లను ♦ తగిన వయసు
వచ్చె నీమన మెవ్వని ♦ బడయుగలదొ. ౧౫

చ॥ అనుచు వచించు తండ్రికిని ♦ హల్లకగంధి నమస్కరించి నా
మనము గిరీశుదప్ప నర ♦ మాత్రుని జేరదు గాన మీర లే
మనక మమేప్సితమ్ముకు వి ♦ మర్శన జేయకుమన్న బిడ్డతో
గుణవతియైన తల్లియనె ♦ కోమలమాధురి వాక్ప్రసంగతిన్

గీ॥ తండ్రి రడిగినమాటకు ♦ తగిన నుడులు
జెప్పకున్నావు నీ మన ♦ స్సీమయందు
నెవ్వరిని నిల్పినావమ్మ ♦ యౌవనంబు
వచ్చియున్నది జెప్పు నీ ♦ వాంఛలెల్ల. ౧౭

ఉ॥ దేవుడు నాదుభర్తయని ♦ దెల్పితి వక్కట దేవుడేడ? నీ
భావమదేడ! మానసి. వి ♦ వాహము జేసుకొనంగలారె! హా

కేవల్య తావకేప్సితము ♦ కేమిఁక వర్ధిలజేయు తండ్రి నా
పావనుసాక్షిగా నర వి ♦ వాహము సంపద లుల్లసిల్లగన్.

క॥ అని జెప్పు తల్లిమాటలు
విని మనమున శంకబొడమి ♦ వేగిరమున తా
నని ఛండిక మాతయు విన
గను ఘనుఁడగు శర్వుమీఁద ♦ కాంక్షలలవడన్. ౧౯

అమ్మా! అనన్య సామాన్యరూప లావణ్య విరాజమానుండును, సకల లోకైక భర్తయగు నీశ్వరుడుదక్క నింకొకరుండు నా హృదయసింహాసనాధీశుండు కాజాలడని పలికి బిరబిర తన శయ్యాగారంబుజేరి అస్తమానుండగు సూర్యునవలోకింపుచు నాలోచన తరంగ డోలాయమాన మానసియై యున్నను తల్లి పిలచుటం జేసి భోజనంబు రుచింపకున్నను భుజించి వెంటనే శయ్యార్ధభాగంబున మేను వాల్చి మైమరచె నంత శంకరుండు ౨౦

...{ ఉర ఛండికకు స్వప్నమున శంకరుండు సాక్షాత్కరించి పుత్రు నొసంగుట.

సీ॥ తలమీఁద నెలవంక ♦ మిల మిల వెలుగుచు
గంగా ప్రవాహంబు ♦ గప్పుకొనగ
ఫాలాగ్ని నుదుటిపై ♦ భాసిల్ల నురగముల్
నాగభూషణ ధర్మ ♦ నడుపుచుండ
మందహాసంబున ♦ కందోయి వికసించి
భక్తరక్షకుడను ♦ ప్రభను జూప

చేత త్రిశూలంబు ♦ చెన్నొంద వక్షాన
పునుకు హారంబులు ♦ గనుపడంగ

గీ॥ నల్లనల్లన దరిజేరి ♦ యంబుజాక్షి
కరములనుబట్టి లేనెతి ♦ కాంత నిన్ను
ధర్మపత్నిగ గైకొంటి ♦ తథ్యముగను
నన్నుబోలిన పుత్ర సం ♦ పన్న వగుము. ౨౧

వ నీ కుమారుండు నా ప్రియభక్తుండై విరాజిల్లుచున్న కాలంబున నీకు మోక్షమొసంగుదు నని వరప్రదానంబును సంతాన విన్యాసంబును గావించి శర్వుం డంతర్హితుండయ్యె

ఉ॥ అంతట తెల్లవారగనె ♦ యా సుకుమారియు లేచి వేడ్కర
న్వంతయు శంక లేక నెక ♦ పర్ది దలంచుచు కొన్నినాళ్లు ని
శ్చింతగనున్న తల్లి సుత ♦ చెయ్వుల గన్గొని మానసంబునన్
వింతలుదోచ నిట్లనియె ♦ బిడ్డనుజూచియు ప్రేమతోసుతన్

గీ॥ నిన్నుజూడగ బిడ్డరో ♦ నెలయుదప్పి
నట్టులున్నావు లోకము ♦ నందు తప్పు
లెంతురుగదమ్మ జరిగిన ♦ వింతలెల్ల
జెప్పు మన్నను తా నిట్లు ♦ జెప్పదొడగె. ౨౪

వ. తల్లీ! మన మేకాంతముగ మంతనములాడిన రాత్రియందే సకల జగజ్జేగీయమానుండును, విస్ఫుట ఫాలనేత్రుండును, కపాల చర్మాంబర భస్మాస్థిధారుండును, గంగా పార్వతీ సమేతుండు నగు పరమేశ్వరుండు స్వప్నంబున సాక్షా

త్కరించి నన్ను ధర్మపత్నినిగా గ్రహించితి ననియు, ధర్మ రక్షణాకై వంశాభివృద్ధి జెందునట్లు సంతానము బొందిన పిమ్మట మోక్షమొసంగుదు నని వరప్రదానంబు గావించి యంతర్హితుం డయ్యె నన విని విమలాదేవి స్వచ్ఛతర హృదయారవిందయగు ఛండికను స్వాంతమున మెచ్చుకొనుచు కౌగలించుకొని బిడ్డా! నీ హృదయం బతి పవిత్రంబైనదని నుడివి తన యంతఃపురికి జనియె. ౨౫

గీ॥ ఇట్లు కొన్నాళ్లు గడచిన ♦ సేవగింపు
లేక నన్నంబు రుచియింప ♦ దేకముగను
ఆరుమాసము లలవడ ♦ నతివ జూచి
బంధుజనములు ననుమాన ♦ భావములుగ. ౨౬

గీ॥ నీదు బిడ్డకు పెండిలి ♦ నెగడె నెప్పు
డప్పుడే గర్భ చిన్నెలు ♦ నగుపడెనట
యిట్టి చిత్రంబు నెన్నడు ♦ నెరుగ మనుచు
నెంద రెన్నెన్ని రీతుల ♦ నెంచుచుండి. ౨౭

వ. ఇట్లు బందుగులు పలుకు నిందాగర్భితవాక్యములను వినుచు కొంత కాలంబు సహించి తుద కొకనాడు నాగరీకుం డంతిపురి కేగి విమలాదేవితో మన కూతురు గర్భంబు దాల్చినదని లోకులు వాడుకొనుచున్నా రిదేమన నామె మారుబలుకక ఛండికను రాపించిన నెనమిదిమాసంబుల గర్భిణియగుట గాంచి యతండు కొంతవరకు విచారించి యిట్లనియె. ౨౮

తనయా! నీచపుకృత్యమంచు మది సం♦తాపంబు భీతెంతయుం
గనక జారిణివై చరింప దగునా ♦ కన్యాత్వ భంగంబు చే
సిన దోసం బరియయ్యె కాల్వదె యిసీ♦చీ! నా కులంబందు స
ద్వన హాలాహల రూపు నొందితివిగా♦ బాలా ని నేమంగనో.

గీ॥ అనెడి తండ్రికి సుతయనె ♦ ఘనుని శివుని
తాను ప్రేమింప స్వప్నాన ♦ దర్శనమిడి
వరము నిచ్చుట దెల్పిన ♦ వార్త విని
నాగరీకుండు సంతాప ♦ భాగుడయ్యె. ౩౦

వ. విచారింపుచు యేమిజేయుదు. ఈ విషయ మెవ్వరేని విన్న
నమ్మరు. అంతేగాక నవ్వులపాల్జేయుదురు. ఆభిజాత్యకుల
సంపన్నుడనగు నాకీ యపనింద సహింపరాకున్నది. యని
యాలోచింపుచున్న కాలంబున మార్గవశంబున బోవు మ
హర్షులగాంచి యెదురేగి అతిథి సత్కారంబు గావించి
తోడ్కొనివచ్చి యుచితాసనము లిచ్చి తన కూతురినిజూపి
యిట్లనియె. ౩౧

క॥ ఈ సుదతి నాకు కూతురు
దోసము తనకేమి దెలియ ♦ దో యనుచుండన్
భాసుర గర్భం బా గజ
శాసను వరయోగ మహిమ ♦ సారమను చనన్.

చ॥ అన విని వారలంత మన♦సారగ యోగముచేత జూచి నీ
తనయ పతివ్రతామణి య♦దార్థము నీకు వరప్రభావమే

ఘనమగు గర్భధారణము ♦ గల్గెను నింకు మహానుభావుడౌ
తనయుడు నున్నవాడు ప్రమ ♦ థాధిప భక్తుడు బుట్టుభక్తిమై

గీ॥ గాన నీమెకు దోసంబు ♦ గలుగబోదు
సంశయింపగ బనిలేదు ♦ చంద్రవదన
ననుచు బోయిరి వారంద ♦ రంత నాగ
రీకు హృదయాన గలుగు ప ♦ రాకు వదిలె. ౩౪

వ. ఇట్లు కొన్ని దివసంబులు గడువ ౩౫

✻ ౭౫ ఛండికకు శంకరదాసయయ్య జన్మించుట. ✻

మ॥ నవమాసంబు లతిక్రమించ పిదపన్ ♦ నారీ శిరోరత్నమా
శివునిన్ మానసమందునిల్పుకొనిస ♦ ్శ్రేయంబుగానొక్కటౌ
దివసంబందున గాంచె పుత్రుని మహా ♦ తేజస్వరూపాన వా
సవ పుత్రుండన సుందరాన్వితుడు వం ♦ శంబందు జన్మించినన్

వ. ఇట్లుదయించిన దౌహిత్రుని గని నాగరీకుం డపరిమితా
నందంబుతో జాతకర్మాది క్రియల నాచరించి ౩౬

గీ॥ శివుని వరయోగ మహిమ ను ♦ ద్భవుడు శిశువు
నాట శంకరదాసని ♦ నామకరణ
మును నొనర్చియు సఫల ద ♦ క్షిణలు మొదలు
పరమ సత్కారముల జేసె ♦ బ్రాహ్మణులకు. ౩౭

చ॥ అతడు క్రమంబుగాబెరిగి ♦ యాటలనాడడు పార్వతీశ్వరున్
మతినిదలంచు నెప్పటికి ♦ మాటలుబల్కడు యోగనిద్రలో
సతతమునుండ తల్లి సర ♦ సంబుగబిల్చిన రాడు వచ్చినన్
మతిచలియించువానిగతి ♦ మౌనముదాలుచుబల్కడేమియున్

సీ॥ చిత్తంబు శివునిపై ♦ తత్తరబడుచుండ
రుద్రుడే గతియని ♦ రూఢి బలుకు
ఫాలాక్షుడే నాకు ♦ పతి గతి యనుచుండు
శంకరుండే నాకు ♦ జనకు డనును
ఆతని భక్తులే ♦ యన్న దమ్ములు నాకు
ఛండికయే నాకు ♦ జనని యనును
భవునిపై భక్తియే ♦ నవనిధు లున్నట్లు
నాతని సేవయే ♦ యఖిల సుఖము

గీ॥ లనుచు పిల్లలకును జెప్పు ♦ నతనిజూచి
తల్లి యమ్మమ్మ సంతోషి ♦ తలుగ నైరి
ఛండికాదేవి గనినచో ♦ ఛండియయ్యొ
నాగరికు కేమి కొదువ యా ♦ నందమునకు. ౪౦

* ౭౬ శంకరదాసు కర్మల ధిక్కరించుట. *

వ. ఇట్లు చంద్రబింబంబు మాడ్కి దినదిన ప్రవర్ధమాన శరీరుండగు దౌహిత్రుం గని గర్భాష్టమంబున నుపవీతుని గావింప దలంచు నాగరీకుని గని శంకరదాసు యిట్లనియె మతామహా! లోకంబున పరబ్రహ్మప్రాప్తి హేతు భూతంబులగు కర్మయోగాది సాధనములలో జ్ఞానయోగమే మిగుల శ్రేష్ఠతమమని తామెన్నోసారులు చెప్పుచుండ వింటిని. అందుచే బశుపతి పద కమలార్చనారూపక కర్మయోగంబు దప్ప నా కన్యయోగంబు లభిరుచింపవు. అప్పరమేశ్వరు కృపగలిగినచో కర్మయోగ దుస్సాధ్యములగు

యోగములెన్నో యలవడును. నన్ను మన్నించి నా మాటల దిరస్కరింప వలదని యెన్నోవిధముల నచ్చజెప్పి తత్కాలకరణీయంబగు నుపనయన కర్మ నవరోధించి పిమ్మట పదునాలుగు వత్సరములు బ్రవేశించ మాతామహునితో నిటనియె. ౪౧

{ ౬౭ శంకరదాసు ఘోరాటవిక్రింజని రామనాథునివద్ద పంచాక్షరి నుపదేశము బొంది జఘగిరియందు శంకరునిగూర్చి తపం బొనర్చుట.

గీ॥ ఎచటికైనను నే నేగి ♦ యెలమిగలుగ
విద్యలన్నియు నేరుతు ♦ విధియుతముగ
నానయిండకని వారిచే ♦ నాజ్ఞ నొంది
భవుని మనసార భజియించి ♦ వనము కరిగె. ౪౨

వ ఇట్లరిగి యరిగి లుంగ లవంగ మాతులుంగ మందార చందన కురంటక ఖర్జూర పన సామ్ర వంజుళ వకుళ కదళీ కపిత్థ నారికేళ పున్నాగ నాగ కేతకీ మరువక కోవిదారాది కుసుమిత ఫలిత నానావిధ భూరుహవిరాజమానంబును, సింహ శార్దూల భల్లూక గవయ గండభేరుండ మృగగజాది క్రూరసత్వ నినాదనాదితంబును, హంస కారండవ బకాది జలచర విహంగమ విరాజమాన పంకజాకరంబులును గలిగి నయనపర్వం బొనర్చుచు హృదయంబునకు భీతి జనింప జేయు ఘోరారణ్యంబుల దాటి యొక యాశ్రమంబున రామనాథుండను యోగీశ్వరుం గాంచి ప్రణమిల్లి తా

వచ్చిన ప్రయోజనముం దెల్ప రామనాథ యోగీశ్వరుండు సంతసించి శంకరదాసమయ్యకు విద్యారహస్యంబుల నెల్ల దెలిపి తుద కొకనాడు భవసాగరతారకంబగు పంచాక్షరి నుపదేశించి, వత్సా! నీవు నిర్మలంబగు నొక భవాలయం బున తపోదీక్ష మెలంగుమని యానతిచ్చిన శంకరదాస మయ్య గురునకు నమస్కరించి తదాజ్ఞం జఢగిరియను నొక పర్వతంబునంగల శివాలయంబు ప్రవేశించి యచ్చట తపోదీక్షాపరుడై యున్న కొంత కాలంబునకు బాలచంద్రి కళా ప్రభాభాసమాన కపర్దైక దేశుండును, సకలలోకాజిన నిర్ధూత సమర్థంబగు భాగిరథీ జూటుండును, విచిత్రితర చిత్రినేత్రఫాలమధ్యప్రదేశుండును, భక్తలోకావన పర తంత్రియగు భవానీ దత్తార్ధ శరీరుండును, త్రిగుణాతీత స్వరూప లక్షణ లక్షితతుల్య స్వచ్ఛతర స్వశరీర ధవళీ భూత నరభస్మ త్రిపుండ్రాకార తిర్యక్పుండ్ర లాంఛిత పా దోరు పృష్ఠహస్తాననుండును, వందారు జనానంద సంధా యకంబగు పాదద్వంద్వుండును, అంతస్థిత హాలహాల మే చకఛాయాకంధరుండును, నవరత్నాయిత కపాల హారుం డును నగు నీశ్వరుండు ప్రత్యక్షుంబై శంకరదాసమయ్యతో నిట్లనియె. ౪౩

* ఒరా శంకరదాసునకు శివుండు ప్రత్యక్షుమై వరంబు లొసంగుట. *

గీ॥ వత్సా! చాలించు నీకేమి ♦ వాంఛితంబు
అడుగు మిచ్చెద నని నంత ♦ నాత డనియె

విశ్వభర్తవు నాకేమి ♦ వేరు వాంఛ
లేమియును లేవు వాంఛింతు ♦ నీక నిన్ను. ౪౪

వ. అని పలికి పులకితగాత్రుండై వెండియు నిట్లనియె. ౪౫

గీ॥ దేవ దేవాయ తేనమో ♦ దివ్యరూప
చంద్ర జూటాయ తేనమో ♦ శాంకరీశ
భక్త వరదాయ తేనమో ♦ వామదేవ
నీలకంఠాయ తేనమో ♦ నిగమ వినుత. ౪౬

గీ॥ ఇట్లు ప్రార్థించి వర మగ ♦ చాట్లు లేని
నేత్రములకును దీప్తి కా ♦ లత్రయముల
సూదిలో దారముఁ జేర్ప ♦ సులువు రాత్రి
బవలునందున గన్పడ ♦ వరము దప్పు. ౪౭

ఉ॥ చాలునె యీవరంబనుచు ♦ శంకరదాసున కిట్లు బల్కె నీ
ఫాలమునందు నేత్రము కృ ♦ పామతి నిచ్చితి గాన నీవు దు
ష్కాలమునందు విప్పుకొని ♦ కార్యములన్నెర వేర్చుకొమ్ము నీ
మూలమునన్ జగత్తుకు వి ♦ భూతియు గల్గి దినిక్కమయ్యెడున్

వ. అదియునుంగాక నీవు నీ కులవృత్తి కనుకూలమగు వస్త్రముల కవచరూపంబుగా గుట్టి మహానుభావులకు శీతబాధ లేకుండ నొసంగుము. మరియు నీ మూలపురుషుండగు విధాత మేరుగిరియందు నివాస మొనర్చుటచే నీ వంశీయులు మేరువారని పిలువం బడుచుందురు. మరియు మున్ముందు

నీ పుత్రికా సంతతిలోనివాడగు నామదేవుడనువాడు ము త్యపుచిప్పలో జన్మించు గావున నప్పటినుండి నీ దుహితృ సంతానీకు లెల్లరు చిప్పె (సింపి) వారనియు పిలువం బడు చుందురు. వారందరికిని నీవా దర్శప్రాయుండవై మూల పురుషుండవై యుందువు. మీాదు మిక్కిలి యీా స్థానము జఢగిరియగుటచే నిప్పటినుండి నిన్ను జఢగిరి శంకరదాస మయ్యా యని లోకులు వాడుకొనియెద రింతేగాక మహా శివరాత్రియందు ముఖ్యముగా నావలెనే నిన్ను పూజించు నట్లు నీకు వరప్రదానంబు జేసితినని యంతర్హితుండయ్యె. అంత శంకరదాసు అమితానందముతో నచ్చటనే యాశ్ర మం బేర్పాటు గావించుకొని భర్గు నారాధింపుచు నానం దంబుగ కాలంబు గడుపుచుండ నాతని మహిమాతిశయం బును గాంచి తండోపతండములుగా జనంబులు వచ్చుచు జన్మబాధా నివారణంబు గావించుకొనుచు వేనోళ్ల బొగ డుకొనుచుండిరి. ఇట్లుండ నొక్కనాడు రాజపుంగవుండగు విష్ణువర్ధనుడు వైశ్య పుత్రికయు సహజ సౌందర్యవతియు నగు కన్యకాదేవిని గని మోహించి యామె తలిదండ్రుల కుం దెలియజెప్పిన రాజు గావున స్వీయకులస్థులతో నా లోచింపుచుండ తద్విలంబనమునకు సహించక వీరభటులం బంప నందరు పలాయితులైన గనుగొని బలిమిం గొని తెండని యాజ్ఞాపింప వారలు

## తృతీయాశ్వాసము.

* శ్రీ శంకరదాసు మహిమాది వర్ణన. *

క॥ నలుగురు నలువైపుల తా
గలియక దిరుగుచును నొక్క ♦ కఠినుండై వా
డలుగుచు యాశ్రమమునకున్
గలియంగా వచ్చె ప్రళయ ♦ కాలుని బోలెన్. ౧౦

గీ॥ మోము దమ్మని చిరునవ్వ ♦ మొలక లెత్త
వచ్చు వానికి శాంతియే ♦ మచ్చ టంచు
దలచి కూర్చున్న శంకర ♦ దాసమయ్య
వేషమున్ జూచి భటుడిట్లు ♦ వేగిరమున. ౧౧

వ. వైశ్యాధమా! అవక్రవిక్రమాటోపుండగు మదీయ ప్రభువరేణ్యుల యాజ్ఞ నెరుంగక యోగివేసంబున నిచ్చట గూర్చున్నావు. లే లెమ్ము. రా నిన్ను పెడరెక్కలు గట్టి యీడ్చుకొనిపోయెదను. ఇచట నిను రక్షించువా రెవ్వరో చూచెద ననుచు న మ్మహాత్ముని బట్టబోయిన నాతని నిటలతట ఘటిత నేత్రోద్భూత చ్ఛటచ్ఛటాయిత జ్వాలా కీలిక లా భటుని నంట సహించలేక మూర్ఛాక్రాంతుం డైన న మ్మహాత్ముడు తేజంబు నుపసంహరించుకొని సేద దేర్పించిన నాతం డిట్లనియె. ౧౨

గీ॥ స్వామి! భవదీయ బలమును ♦ జడుడగాన
తెలియగాజాలనైతిని ♦ దెలిసె నిపుడు
మిమ్ము వీడను నిచ్చటే ♦ మీకు సేవ
జేయుచుందును తమ కృపా ♦ శ్రీనిగోనగ. ౧3

వ. అనిపలుకు వీరభటునిఁగని కృపాయత్తచిత్తుండై శంకరదాసమయ్య యిట్లనియె వత్సా! ప్రభు భక్తిపరాయణుండవై నన్నొక వైశ్యునిగా దలంచితివిగాని నేను మేరువంశమునకు జెందినవాడను. నీవు మహా గర్వాంధకారంబున మునింగి యుంటచే నీశ్వరుండు సహించక తగినశిక్ష విధించె నద్దాన నీ యభిమానమడంగి పరమేశ్వరునికి శరణాగతుండవౌటచే ఆర్తత్రాణ పరాయణుండా యీశ్వరుండు గాన నిన్ను రక్షించె. ఇప్పటినుండి నా యాశ్రమమున దేవపూజాకాలంబున ఘంటానాదంబు జేయుచు కాలంబు గడుపుము. మున్ముందు నీ వంశీయులను మా వంశీయులు శుభకార్యములయందు గౌరవించునట్లు వరంబు ప్రసాదించితినని నుడివిన సంతుష్టాంతరంగుండై వీరభటు డచ్చటనే నివసించె. (అట్లు యీ కాలంబువరకు తద్వంశీయులను మేరువారు గౌరవింపుచుండిరి.) తదనంతరంబ ౫౮

సీ॥ శంకరదాసుపై ♦ జగదేక మల్లుండు
పగబూని యాతని ♦ పరిహసింప
కల్యాణ పురమున ♦ కంసారి విగ్రహం
బుక్కున జేయించి ♦ మక్కువగను
పంచలోహంబుల ♦ ముంచి ప్రతిష్ఠించి
పవలు రాత్రులయందు ♦ బలువిధాల
పూజావిధానంబు ♦ పూర్తిగా జేయింప
శంకరదాసు న ♦ చ్చటికివచ్చి

గీ॥ ఫాలనేత్రింబు దెరువ నా ♦ పద్మనాభు
విగ్రహాంబును బగిలెను ♦ వేగ పంచ
లోహముల్ గరగె నచ్చటి ♦ లోకు లంత
పారిపోయిరి ప్రాణి క ♦ పాయ మరుచు. ౫౫

చ॥ ఇటుల గలంచినంతనె మ♦రేమియు జేయుటకైన దోపకన్
బటుతర భక్తి నాతని కృ ♦ పామతి జేయగనెంచి వెంట వి
స్ఫుటనతివారి పాదముల ♦ సోకగ శీర్షము నేల జేర్చి పి
మ్మట జగదేకమల్లుడు స♦మంబగువాక్యులవిన్నవించెతాన్

ఉ॥ శంకరదాసమయ్య నిను ♦ జంగమువాడని యెంచి నేను నీ
వంక మహాపరాధమును ♦ వాసిగ జేసితి గాన నన్ను ని
శ్శంకగ బ్రోవుమయ్య తమ ♦ సన్నిధి దాసుడనన్న నాతనిన్
మంకునువీడు మీాయనుచు♦మన్ననజేసియుపొమ్మటంచనెన్

వ. ఇట్లానతిచ్చి యచ్చటినుండి కొంతదూర మేగి మార్గమధ్యం
బున దుగ్గళవ్వ, దేడరదాసియనువారు దరిద్ర జరాభారం
బును సహింపలేక నాతని పాదములపై బడి లేవకున్న
శంకరదాసమయ్య వారల మనంబు గ్రహించి యంగుళితో
నొకవైపు చూపుచు నచ్చట మీారు త్రవ్వుకొనుడు అందు
ధనంబు లభింపగలదని యానతిచ్చి వారల దీవించి స్వాశ్ర
మంబు ప్రవేశించె నంత. ౫౮

* ౨౦ సర్వమంగళాదేవి శంకరదాసునకు సపర్య లొనర్చుట. *

గీ॥ ఎన్నిరీతుల జూచిన ♦ నన్నివిధుల
నంబికాదేవి పోలిక ♦ నలరు సర్వ

మంగళయనంగ నొక కన్నె ♦ మంగళమయి
చేరవచ్చెను నాతని ♦ సీమ కంత. గీ

వ. చేరి నిటలఘటిత సంపుటీకృత కరారవిందుండును, మల
యానిల దోధూయమాన యేకీభూత జటాధారుండును,
శరదిందు చంద్రికా ధవళీకృత పాండుర దేహుండును, ఆ
కర్ణాంత విశ్రాంత నేత్రత్రియుండును నగు న మ్మహాత్ముని
గాంచి కుసుమ శర పరంపరాఘాతాక్రాంత స్వాంతయై
సర్వమంగళాదేవి ౯౦

గీ॥ వలయు శుశ్రూష జేయగ ♦ వారి యాన
నంది జేయుచు నుండె న ♦ న్యూతివ యెపుడు
పరమ సాధ్వియు సావిత్రి ♦ పటిమ నాథు
నైకమత్యత జీవన ♦ నొక యనుచు. ౯౧

సీ॥ దాసయ్యకంటెను ♦ తాను ముందుగ లేచి
యింటిలోపలి పను ♦ లెల్ల జేయు
డాసు స్నానము జేయ ♦ తను జేసి వెంటనె
పూజ కైవస్తువుల్ ♦ పొందుపరచు
నాలయంబున కేగు ♦ నంతలో వస్తువుల్
ముందుగ తా నేగి ♦ ముందునుంచు
భోజనం బిడి తాను ♦ భుజియించి పాదముల్
మెల్లగ నొత్తుచు ♦ మిన్నకుండు

గీ॥ నెంము కీ కష్టమని యన్న ♦ నేమి బలుక
దిట్టులుండగ నొకనాడు ♦ గట్టు విల్లు
దాల్పు స్వప్నాన గనుపడి ♦ దాసుతోడ
బలికె బ్రేమార్ద్రి దృష్టితో ♦ భావనోక్తి. ౕ౩

{ ౭౧ శంకరదాసు శంకరుని యాజ్ఞానుసారము సర్వమంగళాదేవిని వివాహమాడి యామెయందు సంతానము బడయుట. }

వ. వత్సా! నీ యపారమగు భక్తికి నే నెంతేని సంతసించితిని. ఏది యెట్లున్నను పితృదేవతానీకమునకు సంతోష సంధాయియగు వంశాంకురంబును నంకురింపజేసిన గాని పితృలోకంబు తృప్తినొందదు. కాన ప్రస్తుత మన్నివిధంబుల నీ కీవరకు నే నిచ్చిన వరంబులం దలంచుకొనుచు నీ సాహిత్యంబున నీ కన్నివిధంబుల సపర్యల నొనర్చు సర్వమంగళాదేవిని వివాహంబు గావించుకొనుటయే కర్తవ్యంబు. ఆమెయందు కుమారులు నొక కుమార్తె జనింతురు. మరియు నిన్నెవ్వరేని యనపత్యుండు యాచించిన నాతని యాచన వ్యర్థపుచ్చక నీ పుత్రుల నివ్వక పుత్రికమాత్ర మిచ్చి మద్భక్తితో మెలంగుము. పిదప మోక్షమొసంగుదు నిది నా యాన తప్పక నొనర్చుమని యాతర్హితుండైన తదాజ్ఞ నొదలదాల్చి సర్వమంగళను వివాహమాడి కొంత కాలంబునకు మహాదేవ కృపాలబ్ధులగు పుత్రులును, నొక బాలికామణియు నుదయింప నంను కూతున కంబికయని నామ

కరణంబు గావించి సుఖంబున నుండ కొన్ని నాళ్లకు నరుసోజియను క్షత్రియుం డనపత్యుండై శంకరదాసు మహిమాతిశయముల విని సంతానార్థియై జడగిరి బ్రవేశించి శంకరదాసమయ్యు ననేక భంగుల బ్రార్థింప నంత శివాజ్ఞ స్మరించి యంబిక యాతని వరఫలమనితలంచి నరుసోజి కా బాలిక నొసంగి పంపి పుత్రుల కీశ్వర మహిమాతిశయంబుల బోధింపుచు భగవద్భక్తితో కాలంబు గడుపుచుండె నంత నచ్చట. ౬౩

* ౭౨ నరుసోజి అంబికను పెంచుట. *

గీ॥ అంబికనుగొని తాను క ♦ ల్యాణ పురము
నందు నరుసోజి బెంచె నా ♦ నందముగను
బాల్యమును వీడి యా బాల ♦ వరుసగాను
యౌవనావస్థ బొందిన ♦ యంతమీాద. ౬౪

చ॥ వరుడెటనుండునోయనుచు ♦ వారిని వీరిని జూచి మెచ్చకే
యరుగును కొన్ని దేశములు ♦ నచ్చటనిష్టము లేక నింటికిన్
మరలుచు కాలమిట్టుల స♦మాహితవృత్తిని గడ్పనింటిలో
మరునికతారి పోలిక య ♦ మానుష తేజము గల్గు బిడ్డకున్

వ. ఎట్లైనను త్వరలో వివాహము జరుపుట యుచితంబని వరాన్వేషణమునకై నరుసోజి గ్రామాంతరమున కేగుచు నొక ఘోరాటవి బ్రవేశించి, కమలాప్తకరజనిత నిదాఘోదకాక్రాంత శరీరుండై డస్సి శీతలచ్ఛాయాశ్రయణం బొనర్చి సేదదీర్చుకొనుచుండ నంత. ౬౬

{ ౭౩ వేటకరుడెంచిన కృష్ణాజినిజూచి నరుసోజి తన గృహంబునకు దోడ్కొనిపోయి అంబిక నిచ్చుట. }

ఇనుగో బెబ్బులివచ్చె రం డిటకు రా ♦ రేమీయాయటం చాడితా వదనంబందలి స్వేదబిందువులతో ♦ వాడైన శస్త్రాస్త్ర సం పదతో నొక్కవటుండు వచ్చిన గనెన్ ♦ ప్రాంతంబునన్ సంతసం బధికంబై యొకపల్లుబల్లె తన యో♦ య్యారంబు గాన్పించగన్

గీ॥ అయ్య! యిటురండ టంచన ♦ నాత డంత
వాజినిం దిగి దరిజేర ♦ వచ్చి యచట
విశ్రమించిన నరుసోజి ♦ వినయ మిళిత
వాక్యపద్ధతి నిట్టుల ♦ ప్రశ్న జేసె. ౬౮

వ. వీరకుమారా! నీ వేదేశంబున నుందువు? నీనామంబెయ్యది? యొంటిగా నిటకు రాగతం బేమని ప్రశ్నించిన నాతండు వినయ ముప్పతిల్ల నే నొక రాచకుమారుండ. నన్ను కృష్ణాజి యందురు. నా నివాసస్థానంబు కేరళదేశంబు. వేట కరుడెంచిన వారందరు వేరొక మార్గంబున బోయినట్లు న్నది. నేను వారికి కలిమిడి చేయవలయుననిన విని నరు సోజి యాతని కిట్లనె. ౬౯

గీ॥ వేట నలసిన శ్రమలను ♦ వీరపుత్ర
మద్గృహాంతరసీమ స ♦ న్నాన విధుల
సేదదీరుచుకొనుమన ♦ జిత్త మలరి
మీదు చిత్తమటంచన ♦ మిగుల ప్రేమ. ౭౦

వ. కృష్ణాజి తన వాక్యముల దరించినందులకు భగవానుని నెంతేని గొనియాడుచు, తన యింటికిం దోడ్కొనిపోయి మజ్జన భోజనాదుల నాతని దృప్తిపరచు మధ్యకాలంబున మీనకేతన విజయ వైజయంతివలె విరాజిల్లు నంబికం గని కృష్ణాజి మోహితుండై యత్యంత సందేహ చిత్తంబుతో నరుసోజికి తన మనంబు దెల్ప, దైవకృతంబని సంతోషించి కన్యాదానంబు జేసి కృతకృత్యుండై నరుసోజి తపంబున కేగె నంత. ౭౧

* ౭౮ అంబికకు సంతానము గలుగుట. *

ఆ॥ పరగ చతురశీతి ♦ బంధనంబుల ప్రీతి
బొందుచుండి మరి ము ♦ కుంద చరణ
పూజసేయుచున్న ♦ పూని కాని నంబిక
కపుడు పుత్రవాంఛ ♦ యలరుచుండె. ౭౨

వ. ఇట్లు వాంఛించు నా యువతికి క్రమంబుగా ౭౩

గీ॥ స్థిరము సంతాజి మాండ్కాజి ♦ దేవుజియని
పుత్రులును గల్గి రంపులో ♦ పుణ్యయుతుడు
పెద్ద సంతాజి కప్పుడు ♦ ప్రేమ నుపన
యనము గావించ విద్యకై ♦ యరిగె నంత. ౭౪

{ ౭౫ సంతాజి కాంచీపురంబున ఆనందియను కన్యకను వివాహమాడి స్వగృహంబు జేరుట. }

ఉ॥ వేదములన్ షడంగముల ♦ వేరగువిద్యల నేర్చి యోజ్ఞుడై
సాదర మొప్ప నార్యుని మ ♦ హానుమతిన్గొని కాంచిలోన తా

శ్రీధరుజూచి యచ్చటనె ♦ శీలగుణంబుల కెల్ల మేటియా
గ్గాదరహాస వక్త్రనొక ♦ కామినిబోవగ జూచి మోహాతఁ

వ. అప్లోగడి యాతన్వి పరిచయంబునకై పరసరభూమిం ది
రుగువారలచే దెలసి వారా తన్వి నామంబానందియని
చెప్పి తలిదండ్రులం దెలిపిన గుర్తెరింగి వారింటికేగి ౭౬

చ॥ కని మనసెల్ల మోహమను కం♦థిని మున్గిన నామెపెద్దలఁ
గని దన చిత్తముఁ దెలుప ♦ గా నపుడే తన పుత్రికంత వే
డ్కను హితబంధుజాలమున ♦ గౌరవబుద్ధిని పెండ్లిజేసి పా
వనుడయియల్లునిఁ సుతను♦బంపెనుకట్నములెల్ల బెట్టియుఁ

గీ॥ వెంట నిడుకొని ఘోరమౌ ♦ విపినమందు
మద్యమును ద్రావి కలహించు ♦ మనుజుల గని
దయదలంచియు వారిన ♦ త్యంత మృదుల
వాక్కులను బల్కె సంతాజి ♦ వారు వినగ. ౭౮

వ. అన్నలారా! మీరిర్వురేక దేశంబులో జన్మించి భగవ
న్నిర్మితాహార పానీయంబుల ననుభవింపుచు సౌఖ్యంబుగా
ధర్మమార్గంబుల నడచుచు శ్రేయంబు గొనుట ముఖ్యంబు.
అట్లుగాక శాస్త్రదూష్యంబై లోకహేయ పదార్థంబులగు
మద్యమాంసంబు లనుభవించుట మంచిదని తలంచితిరా?
మద్యపానమునకుగలవిరోధంబు వినుడు "సురాపాన కృతం
పాపం సుధాపానేన నశ్యతి" యను స్మృతికి తగినది గాదు.

ఉ॥ కన్నులు మెట్టబారగ పి ♦ కారపువాసన వక్త్రమొందగా
గన్నను మిన్నుగానక స్వ♦కాంతుకురోత జనింపజేయు తా

గన్న కుమారు లగ్గిదరు♦కష్టము లెన్నియొ సంభవించు మీ
యెన్నికయుఁ నశించు మఱి♦యేమిదివీడుఁడు మద్యపానముఁ

వ. ఇక మాంసం బెట్టిదనిన. ౧౧

గీ॥ కత్తి చేబట్టి యేమి యి♦క్కట్టు దెలియు
నట్టి మృగఖగ జీవమా♦లయయొ! చంప
నెంత ఘోరంబొ చూవె తా♦మంత కఠిన
హృదయులై జేయుటిది పాప♦పదముగాదె. ౧౨

వ. అని యుపదేశించిన వారలు కలహంబు మాని యథేచ్ఛఁ
జని రంత సంతాజి యానందితో తన పుణ్యాశ్రమంబు
ప్రవేశించిన. ౧౩

* ౭౬ ఆనందికి పాండురంగడు, జ్ఞానదేవను పుత్రులు గలుగుట. *

చ॥ అరయఁగ కొంత కాలమున♦కా చెలి కాత్మభవుల్ జనింప సం
బరమున పాండురంగడని♦ బాగుగ పెద్దకుమారుబిల్చుచుఁ
బరువడి జ్ఞానదేవనుచు ♦ వాంఛను రెండవవాని బిల్వ వా
రిరువురు నెంచి రాహారి మ♦హేశుల బాల్యము వీడిరందులో

* ౭౭ పాండురంగడు దానాయియందు నల్వు సుతులందు బడయుట. *

గీ॥ పాండురంగడు పెద్దయై♦ పుండరీక
నాభు నెంచుచు నుపనీతు♦డయ్యె దేశ
దేశముల్ తిర్గి యొకచోట♦ దివ్య తేజ
రాశి దానాయి యను కన్య♦ రమణతగని. ౧౪

వ. తత్కన్యా పాణిగ్రహణ కుతూహల మానసుండై కొంద
రితో మంతనంబు జేసి తన్మాత్ర సంఘటనా పూర్వకంబుగా

నక్కన్యకల వివాహంబాడి పాండురంగడు నత్యంతానం
దంబుగా కాలంబు గడుపుచు క్రమంబుగా నల్వురు కు
మారులం గనిన వారలకు ౮౬

గీ॥ వరుస లింబాజి యనియు బా ♦ బాజి యనియు
కోర్కె భగవంతుడనగ స ♦ కోజి యనగ
పేరులనుబెట్టి తల్లి సం ♦ ప్రీతి తోడ
పంక్తిరథుని కుమారుల ♦ వలె నలరిరి. ౮౭

వ. ఇట్లుదయించిన బాలురకు క్రమంబుగా నక్షరాభ్యాసాది
కార్యంబుల జేసి వ్రతబంధనంబు గావించి గురుకులాశ్ర
మంబునకు బంపిన నందు సకోజి. ౮౮

* ౭౮ సకోజి బృందావనమున తుకాయిని వివాహమాడుట. *

గీ॥ సకల విద్యల నేరిచి ♦ సరస వాక్య
రచనచే యొజ్జ మెప్పు ప ♦ రిచితి వడసి
యాన గైకొని పుణ్యయా ♦ త్రానుకూల
దేవతలజూచి జేరె బృం ♦ దావనంబు. ౮౯

గీ॥ ఆ దినము గోకులాష్టమి ♦ యగుట కృష్ణ
వైభవంబును సేవించు ♦ వాంఛ దగిలి
యమున నీరాడి కృష్ణాల ♦ యమును భక్తి
జేరి సేవించె నుతదేవు ♦ భూరి మహిమ. ౯౦

క॥ పాలును వెన్నయు పెరుగును
మేలగు శర్కరయు గలిపి ♦ మించిన బగిదిన్
కాల యమునిని హరియించు కృ
పాలుని యదునందనేచ్ఛ ♦ బరిగిన వానిన్. ౯౧

వ. నివేదనంబునకు సమర్పించి సాగిలబడి ౯౨

గీ॥ ఓన్నమో వాసుదేవాయ ♦ పన్నగారి
వ. వాహనాయనమో భక్త ♦ వత్సలాయ
దానవహరాయ దుష్ట వి ♦ ధ్వంసకాయ
యదుకులాంభోధి చంద్రాయ ♦ యంజలిదుగొ ౯౩

వ. ఇట్లనేకవిధంబుల బ్రార్థించి పురంబుజూచు వేడ్కతో
రాజవీధి శృంగారంబు గని యచ్చెరువందుచు నివాస గృ
యరుదెంచు కాలంబున దివ్యాంగనబోలె
సకలాంగ సౌందర్య సౌకుమార్యాతిశయంబు గల కన్యకా
మణి నొక్కర్తె గాంచి యనంగబాణాంకుడై యా
జవ్వని దీనివాస గ్రామమేయనియు, తుకాయి యను నా
మముగలదనియు నామె నిజవృత్తాంతం బెఱింగి యా తరుణీ
నివాసంబునకు జని యచ్చట ౯౪

సీ॥ గీ॥ తల్లిదండ్రుల దరికేగి ♦ తనదు హృదయ
మంత దెల్పిన వారలు ♦ నతని వంశ
గౌరవాదుల నడిగియు ♦ కన్య నిచ్చి
పెండ్లిజేసిరి స్వగృహోక్త ♦ విధియుతముగ. ౯౫

వ. అట్లు ఐదుదినంబు లుద్వాహవిధుల నిర్వర్తింపజేసి యా
రవనాటి సాయంకాలమునం దా నూతనదంపతుల శయ్యా
గారంబునం బ్రవేశింపజేసిన ౯౬

ఉ॥ మారునిచేతి బొమ్మవలె ♦ మంజులకంకణ క్రేంకణాది సం
పూరిత శబ్దజాలములు ♦ ముగ్ధయటంచని చెప్పుచుండగా

సారసనేత్రి వచ్చె నది ♦ చక్కగజూచి సకోజి మెల్లగఁ
జేరగబోయి హస్తమును♦ చేకొనిమోహము పొంగిపొర్లగఁ

గీ॥ హస్తమునుబట్ట ముగ్ధత్వ ♦ మపుడె బోయి
మారబాణ సమాన యా ♦ మగువ దృష్టి
కోడ భర్తను జూచిన ♦ తోయజాస్య
నప్పుడే కౌగలించెను ♦ మెప్పువడసి. ౯౮

వ. అట్లు గాఢాలింగన జనితానందాబ్ధి తరంగంబుల నూగు
లాడుచు గొంత కాలంబు గడుపుచుండిన తదనంతరంబ

✻ ౭౯ తుకాయికి దామాజి గలుగుట. ✻

సీ॥ సంతాన వాంఛయు ♦ సతిమనంబున గల్గ
విష్ణు పూజలు జేసి ♦ వినయమతిగ
నిత్య సత్యవ్రతు ♦ నిగమాంత విజ్ఞాన
నిధి భక్తియుతుడును ♦ నీరజాక్షు
చరణసేవితు డర్ధి ♦ జనపోషకుండును
ధర్మ మార్గంబును ♦ దప్పనట్టి
దామాజియను చిన్ని ♦ తనయుని బడసియు
జాతకర్మాదుల ♦ సలిపి పిదప

గీ॥ నక్షరాభ్యాసమును జేసి ♦ యంతమీద
నుపనయనమును జేసి తా ♦ నోర్పు గల్గ
విద్యలను నేర్ప బంపిన ♦ వేగిరముగ
నేర్చి దామాజి వచ్చెను ♦ నిలయమునకు. ౧౦౦

వ. వచ్చిన తదనంతరంబు. ౧౦౧

* ౮౦ దామాజి పండరిపురంబున కేగుటం *

చ॥ జనకునితోడ కొన్ని దివ♦సంబులు నుండియు తల్లితోడ నా
వ. జ్ఞనుగొని దేశదేశముల ♦ జ్ఞానసుబోధ లెరుంగ జేయుచున్
ఘనమణి గోపురాద్యధిక ♦ కానన పుష్పిత వల్లరీ గణం
బును ధనరత్నమండిత య♦మోఘముపండరి జేరబోయినన్

* ౮౧ పండరి పుర వర్ణన. *

గీ॥ నిఖిల భూర్భువాది లోకముల్ ♦ నెత్తినిగల
శేషుడోగియెంచ పైసునా ♦ సీరుడెల్ల
చూచుటకు దోచకుండెడు ♦ చుట్టు కోట
వరలె వైరులు బేధింప ♦ వశములేక. ౧౦౩

సీ॥ శశికాంతమణి గణ ♦ స్థగితకాంతిచ్ఛటా
సంయుత సుందర ♦ సౌధములును
ఫలపుష్ప పల్లవ ♦ భరిత రాజోద్యాన
సీ॥ భాసిత వల్లరీ ♦ పాదపములు
నవమణి ప్రాసాద ♦ నవ్యాంతరస్థల
సంచారితానంద ♦ చంద్రముఖులు
నుచ్చైశ్శ్రవంబును ♦ మెచ్చనివాజులు
నైరావతంబును ♦ మీరుకరులు

గీ॥ భీమబలముల మెచ్చని ♦ వీరభటులు
గురువునకు తప్పువెట్టెడు ♦ గొప్ప ద్విజులు
సత్య ధర్మప్రచారులు ♦ క్షత్రియులును
వైశ్రవణు నీసడించెడు ♦ వైశ్యజులును
పుణ్యవర్తన శూద్రులా ♦ పురిని గలరు. ౧౦౪

వ. మరియు విశాలములగు రాజవీధుల నొప్పారు నప్పండరీ
క్షేత్రంబు సొచ్చి రుక్మిణీ సహిత పాండురంగ దర్శన
కుతూహలోద్దీపిత హృదయుండై దామాజి ౧౦౫

* రాజ దామాజి పాండురంగని దర్శించుట. *

చ॥ చని యటగాంచె సోదకవి♦షప్రదకాయుని శత్రుజిత్సుద
ర్శన దరశార్ఙ్గనందక క♦రస్థుని కాంచనచేలునిన్ గృపా
వననిధి సూర్యరుగ్వికచ ♦ పద్మదళాయత లోచనున్ గళా
దనవర తార్త్తరక్షకు వి♦హంగ తురంగని బాండురంగనిన్.

వ. ఇట్టు లా దేవదేవుని గని సాష్టాంగ దండవత్ప్రణామము
లాచరించి, యనేక భంగుల వినుతించి, యర్చకు లొసగిన
తీర్థ నిర్మాల్యాదులం బరిగ్రహించి తదనంతరం బచటినుండి
చంద్రభాగా నదీతీరంబునకు విచ్చేసి. ౧౦౬

గీ॥ తీర్థవాసులతో తాను ♦ దిరిగి తిరిగి
క్షేత్ర వృత్తాంతముల విని ♦ చెవులు ధన్య
మయ్యె నంచని యా నదీ ♦ ప్రాంత మందు
జేరి గూర్చున్న యంత నా ♦ సీమలోన. ౧౦౭

* రాజే దామాజి గుణాబాయిని జూచి మోహించి వివాహమాడుట. *

కొంగు ప్రభాతవాయువుల♦కున్నలు యోటమిజెప్పుచుండ మేల్
ముంగురులాడగా సొగసు ♦ బూనిన దేహము కంటికింపుగన్
బంగరు బొమ్మవోలె నొక ♦ భామ ఘటంబును చేతబట్టి తా
నుంగన నీరునింపి కొల ♦ నుంగల పీఠ మలంకరింపగా. ౧౦౮

సీ॥ ఆ మానినిః గిరి ♦ దామాజి హృదయంబు
మోహాంపుటిర్లచే ♦ ముంపబడియె
దరికేగ సందేహ ♦ తప్తుడై చిత్తంబు
సరిజేయ చలితమై ♦ సంచరింప
పులకిత గాత్రుడై ♦ పూబోడి కడకేగ
చరణవిన్యాసంబు ♦ సలుపుమండి
యేమిబల్కిన తన ♦ కేమి వచ్చునో యంచు
సంశయావిష్టిత ♦ స్వాంతు డగుచు
గీ॥ నెట్టకేలకు గాపుండి ♦ యిట్టులనియె
ముగుద నీ పేరు నిన్గన్న ♦ పుణ్యు లెవరు
వాస మెచ్చట జెప్పుము ♦ వాస్తవముగ
ననెడు దామాజి వాక్యము ♦ లాలకించి. ౧౧౦

వ. దిగ్గునలేచి సందేహిత హృదయారవిందయై జితమన్మథా కారుండగు నాతని యాకారంబు తన మనోరథ మీడేర్ప రంగనాథుడు కృపచే ననాలోచితంబుగా దర్శనమగుట కెంతేని యానందింపుచు తన యభిమాన మాతనికి దెల్పిన నేమియనునో యని యాలోచింపుచు నేలజూచుచు తన కేరిగంటి చూడ్కులబరపి యాతని హృదయ ధనంబు లాగుకొని పాదాంగుళిచే నేలపై వ్రాతల వ్రాయుచు కంబు సదృశంబగు కంఠము సవరింపుకొని కలకంఠ కంఠ స్వరంబు జీరబార నెట్టకేల కిట్టులనియె. ౧౧౧

క॥ ఈపురి పాలించెడి యా
భూపతి నాతండ్రి మిగుల ♦ పూజ్యుడు ధరలో

నా పేరు గుణవ తందురు
మీపేరే మెచటికేగ ♦ మే కొనియెదరో. ౧౧౨

అని యిట్లడిగి తద్వృత్తాంత శ్రవణ కౌతుహలంబు లేని దానివలె పూర్ణకుంభంబు కక్షంబున నిడుకొని క్రేగంటి చూడ్కులఁ జూచుచు నడచుచుండ దామాజి యద్దువచ్చి వనితా! అసంఖ్యాకంబులగు దాస దాసీజనంబులుండ నీ కేల యీ శ్రమ. యన నక్కాంత యిట్లులనియె. నాయ నుంగు కుసుమ కుంజ లతానికుంజంబులకు నేనే నీరు పోయుదును కాని మీ వృత్తాంతము దెలుపరైతిరి యని గొణుగుకొనుచు నడచుచున్న యమ్ముగుద ననుసరించి పోవుచు దామాజి తన వృత్తాంతము జెప్పిన విని మా యింటి కరుదెంచి నన్ను వివాహమాడుమను భావంబు స్ఫురింప మీ రొంటిగా నిక్కడ యుండవలసి వచ్చినది కాబోలు! మా జనకునికి మీ దర్శనభాగ్యంబు సమకూర్పు డని జెప్పి వనాంతరమున ప్రవేశించి నంత నతఁడు గుణా బాయి యింటికేగ తజ్జనకుం డతిథి సత్కారంబు గావించి ప్రేమించి తన యాభిప్రాయ మెరింగి యాతని వంశ గౌరవముల కభినందించి కూతు నిచ్చి వివాహంబు గావించిన వా రిరువురు పరస్పర ప్రేమానురాగ సాంద్ర చిత్తంబులతో ౧౧౩

చ॥ వనముల సంచరింతు రొక ♦ వారము నట్టె విలాసగేహమం
దునవిహరింతు రావిధని♦తోయరుహాక్షియుదానుగూడియిం
పునసికతాతలంబులన ♦ పూర్వ గుహాదుల విశ్రమింతు రి
ట్లని యననేల వారల మ♦హార్హ సుఖంబుల నెన్న చిత్రమా

గీ॥ ఈ విధంబుగ కాలంబు ♦ నెల్లగడిపి
తుదకు సంతాన వాంఛ యా ♦ తోయజాస్య
చిత్తమున గల్గి భర్తతో ♦ జెప్పె నిట్లు
రంగనాథుని కృపయింక ♦ రాదు కనగ. ౧౧౫

గీ॥ గతులు లేవింక పుత్రులు ♦ గలుగకున్న
తపముజేయుము యిప్పుడా ♦ దానవారి
రక్షకునిగూర్చి జేసిన ♦ లక్షణయుత
సుతులు గలుగకయుందురా ♦ శుభచరిత్ర. ౧౧౬

{ ౮౭ దామాజికి పాండురంగని వరప్రభావంబున చంద్రభాగలో నామదేవు లభించుట. }

అని ప్రార్థించిన భార్యమాటలను తా ♦ నాలించియుఁ భక్తిస న్మనమందుఁ హరి! పుండరీకనయనా! ♦ మానాథ! దేవా! జనా ర్దన! సర్వేశ్వర! మాపయిఁ కరుణ సం ♦ తానంబు నిమ్మన్న నం తనె స్వప్నంబున పండరీశ్వరుడు తా ♦ దామాజితో నిట్లనెఁ.

గీ॥ నీవు ననునమ్మియుంటచే ♦ నిక్కముగను
పుత్రునిచ్చెద నిప్పుడు ♦ పూర్ణభక్తి
భీమనదిలోన స్నానముల్ ♦ ప్రీతి నెరపి
ననుదలంచుచు నుండ మ ♦ న్ననగ నీకు. ౧౧౭

చ॥ సుతుడు లభించుమాక్తిక సు♦శోభిత పేటికయందు నీకునఁ
సతతము దల్పువాడు గుణ♦సంయుతుడాప్తసమగ్రభక్తినై
హితుడై నాకు మీకనుచు ♦ నింపుగజెప్పియు వేగదాతిరో
హితుడై నంత మేల్కని ర♦మేశు దలంచియు భార్యకిట్లనెఁ.

గీ॥ స్వప్న వృత్తాంత మంతయు ♦ సరిగ జెప్పి
భీమనదికేగి స్నానాది ♦ విధుల నెరపి
యెదురు జూచుచుండగ ♦ నదిని వీచి
కలను పేటిక గాన్పించె ♦ కన్నుగవకు. ౧౨౦

వ. వెంటనే నదీజలంబులలోనికి దిగ నదీమతల్లి తన యనంత
కరములచే నితనికి సుతుని నొసంగుచున్నదో యనురీతి
తరంగములపై దేలియాడుచు వచ్చుచున్న మౌక్తిక మం
జూష నందుకొని దరిజేరి యా పేటిక విప్ప నందులో
మాతృగర్భకోశమున నున్న శిశువు తెరంగున బ్రికా
శించు శిశువును గ్రహించి ప్రహృష్టాంతరంగుండై యింటి
కేగి బాలకుని భార్య కొసంగిన నంత కృష్ణునింగన్న దేవకీ
దేవికి స్తన్యంబు లుద్భవించిన చందంబున నా గుణాబాయి
పయోధరంబులు క్షీరపూరితంబులై నంత న బ్బాలకున
కొసంగి తృప్తినొందించిన యనంతరంబ ౧౨౧

గీ॥ పేరుబెట్టగ యచ్చటి ♦ పెద్దలంత
జూచుచుండగ నిట్లు న ♦ చ్యుతుడు బలికె
నామదేవాభిధానంబు ♦ తో మనుగడ
సంతతము భక్తిగలుగుచు ♦ సాగుననుచు. ౧౨౨

* రా॥ నామదేవు బాల్యాది వర్ణన. *

వ. ఇట్లాజ్ఞాపించి యంతర్హితుండైన యనంతరంబు సకల
మానవ హృదయాజ్ఞాన నిర్ధూశనా సమర్థుండగు నామదే
వు డనుదినంబు ౧౨౩

సీ॥ అహరహంబులయందు ♦ నచ్యుతు దలచుచు
వేదాంత మార్గంబు ♦ వెదకుచుండు
శిశువయ్యు తానుండి ♦ శ్రీరంగనాధుని
రూపును గని వేరు ♦ రోయుచుండు
నడుసనేర్చియు తాను ♦ గుడికేగ దలచును
జిహ్వ కేశవుని భ ♦ జింపుచుండు
హస్తముల్ తాళము ♦ నచ్చ వేయుచునుండు
చిత్తమా హరిపాద ♦ సీమజేర్చు
గీ॥ నిట్లు కాలంబు గడుపుచు ♦ నెపుడు గనిన
స్వామి పాదారవింద సం ♦ స్మరణదక్క
నన్యమును దల్ప డాతడు ♦ నతనికి విధి
వత్తుగా వ్రతబంధన ♦ వాంఛదీర్చె. ౧౨౮

సీ॥ దామాజి యొకనాడు ♦ భామతో నిట్లనె
గ్రామాంతరంబున ♦ కార్య మొకటి
యుంటచే బోయెద ♦ నోగి నీ దినము రంగ
నాథు పూజకు మన ♦ నామదేవు
నంపు మటంచు తా ♦ నరగిన పిమ్మట
పిత్రాజ్ఞ గుడికేగి ♦ ప్రీతి రంగ
దేవుని పూజించి ♦ దివ్య ఫలంబుల
ముందిడి తినుమన్న ♦ ముట్టకున్న
గీ॥ బాలుడను గాన తప్పులు ♦ బహువిధముల
గల్గియున్నను కరుణించి ♦ కావుమయ్య

నీవు తినకున్న మాయమ్మ ♦ ౖవగొట్టు
తప్పకను తిను మో దేవ ♦ తార్క్ష్యవాహ. ౧౭౫

గీ॥ నామదేవుని మేల్ ప్రార్థ ♦ నను విని మది
భక్తవరదుండు కాన నా ♦ పక్వ వస్తు
నిచయ మెల్లను భుజియించి ♦ నియతి బలికె
నెవ్వరికి జెప్ప కో వత్స! ♦ యీ విధంబు. ౧౭౬

వ. రంగనాథుని యాజ్ఞ శిరసావహించి ప్రణామంబు గావిం
చిన నంతర్హితుం డయ్యె. నంత నామదేవు ఇంటికే తెంచి
తల్లి ప్రసాదం బేదన జరిగినవృత్తాంతము జెప్ప నాశ్చర్యం
బుణో మరునాడు నాథుని కెఱిగించిన నాతండు తిరిగి తన
పుత్రునే బంప భుజించుటకు సంశయింపుచున్న దేవదేవు
నిం గాంచి నామదేవుడు ౧౭౭

గీ॥ రంగనాథాయ తే నమో ♦ రమ్యరూప
నారసింహాయ తే నమో ♦ నళిననాభ
విశ్వబీజాయ తే నమో ♦ వేంకటేశ
భక్తరక్షాయ తే నమో ♦ భార్గవీశ. ౧౭౮

వ. అని నిమీలిత నేత్రుండై కరముల మొగిడ్చి స్వామీ!
మత్పిత పరీక్షకై వచ్చినాడు కరుణించి భుజింపవే యను
చుండ రంగనాథుడు ౧౭౯

గీ॥ మరల బ్రార్థించు భక్త దా ♦ మాజి తనయు
మాట నిల్పగ వచ్చి స ♦ న్మానముగను

నారగించిన నదిజూచి ♦ హర్షితాత్ము
డయ్యె సుతుసి వివాహంబు ♦ చెయ్యదలచి.

✱ రా౬ నామదేవుని వివాహాది వృత్తాంతములు. ✱

వ. ఇట్లు దినదిన ప్రవర్ధమాన శరీరంబుతో బాటు భక్తి వృద్ధి యగుచుండ రాధాభాయి యను కన్నియను వివాహంబు గావింప సుఖముగా కొన్ని దినములు గడచిన నామెకు పుత్రులు నొక పుత్రికయు గలిగి వృద్ధిబొందుచుండిరి.

గీ॥ ఇట్టులుండగ నంత జ్ఞా ♦ నేశ్వరుండు
నామదేవుని సేవించి ♦ నయవిధముల
సన్నుతించియు నతనితో ♦ సంశయముల
వేద వేదాంత రీతుల ♦ విన్నవించి. ౧౩౨

సీ॥ దివ్యస్థలంబుల ♦ దిరిగివత్తము రమ్మ
టంచు నిర్వురుగూడి ♦ మంచిదైన
క్షేత్రముల్ నదులును ♦ గోత్రముల్ జూచియు
పండరి పురిజేర ♦ పుండరీకు
డనె నిట్లు నామదే ♦ వా నీవు నాచార్యు
నాశ్రయించితివేని ♦ యఘము బాయు
నాగనాథునివద్ద ♦ నయవిద్యలను పరి
శోధించినట్టి వి ♦ సోబ కడకు

గీ॥ పోయి జ్ఞానంబు దెలియుము ♦ పుణ్యమయమ
టంచు దెలిపిన నామదే ♦ వంచితముగ
పరగ జ్ఞానేశ్వరాజ్ఞను ♦ వడసి పిదప
నతని చర్యల జూచిన ♦ మతము గాక. ౧౩౩

గీ॥ పాదములు రెండు లింగాన ♦ బారవైచి
నిద్దురనుబొంది పన్నట్టి ♦ మొద్దుబోలె
పడిన మనుజునిగాంచి తా ♦ భ్రాంతిజెంది
యీశ్వరుని తన్నువాడు జ్ఞా ♦ నేశుడగునె. ౧౩౪

✻ ౮౭ నామదేవు వీసోభాకేశుని నాశ్రయించుట. ✻

వ. ఇట్లు తలంపుచు నాతనినే వీసోభాకేశుడని తెలుసుకొని మెల్లగా నిదురనుండి మేల్కొలిపి స్వామీ! మీ రింతటి వివేకవంతులై యీ దేవునిపై పాదము లుంచుట న్యాయంబే? యని ప్రశ్నింప నాతడు చిరునవ్వు నవ్వుచు వత్సా! శరీరమతిభారము గలదగుటచే సహించక నిట్లే పడియుంటిని గాన మన్నించి యీశ్వరశూన్య ప్రదేశంబున నుంచుమన తిన్నగా లేవనెత్తి మరొక స్థలంబున నుంచిన నచ్చట లింగాకార మేర్పడ నట్లే యంతటను రుద్రమయంబుగా గాన్పించిన నాశ్చర్యాన్వితుండై నిలచియున్న నామదేవుతో వీసోభాకేశు డిట్లనియె. ౧౩౫

క॥ ఈశ్వరమయ మీ జగమని
శాశ్వతముగ నమ్ముమింక ♦ సర్వమయుడు న
శ్వేశ్వరు డన్నివిధంబుల
నశ్వరుడుం గాక యుండ ♦ నవరతములుగన్. ౧౩౬

గీ॥ పండరీశుని యాజ్ఞను ♦ బడసి నీవు
వచ్చినాడవు గావున ♦ భక్తుడవయి

జీవితంబును శ్రీశుని ♦ జేర్పవగిన
దనుచు వేదాంత విషయము ♦ లన్ని దెలిపె. ౧౩౭

వ. ఇట్లు సద్గురు సమాశ్రయణం బొనర్చి నామదేవుండు పండరీనాథుని పరీక్షలనెల్ల జయించి యనవరతము భగవ ద్ధ్యానపరుండై తరించె. పిమ్మట నాతని పుత్రులు యెల్ల కాలము పాండురంగనినే స్మరింపుచు ననేక సత్సంతానముల బడసిరి. మరియు శంకరదాసమయ్య పుత్రులు అనేక సంతానములచే వృద్ధియై మేరువారని పిలువబడుచుండిరి. అంబిక సంతానీయుడగు నామదేవు నుంచి చిప్పె (సింపి) వారనియు పిలువబడుచు విహిత కులాచారాదులచే నుభయ వంశంబులు వృద్ధియయ్యె. ౧౩౮

* ౮౮ ఫలశ్రుతి. *

సీ॥ మునులార నా చేత ♦ వినుపించి నటువంటి
మేరువంశాళి వి ♦ స్తార కథను
పుణ్య తీర్థంబులు ♦ పుణ్యాశ్రమంబులు
దివ్యభవ్య క్షేత్ర ♦ దేవతాళి
చరితల జడగిరి ♦ శంకరదాస మ
హాత్మ్యము నామదే ♦ వాభిధాన
వైభవమును స్వన ♦ వాతు కులాచార
ధర్మప్రచారము ♦ తత్వపదము

గీ॥ గర్భగోళ ప్రశంసయు ♦ కమలజాండ
నాథలీల విశేష సు ♦ బోధలలరు
మేరువంశ పురాణ మె ♦ వ్వారు వినిన
నిహపర ఫలంబులందుదు ♦ రెన్న భువిని. ౧౩౯

క॥ ఈ మేరు పురాణంబును
పామరులును విన్న జ్ఞాన ♦ భవులౌదురు పై
కామితము లొనర జేయును
శ్రీమామానస హరుండు ♦ సిద్ధాంతముగన్. ౧౪౦

గీ॥ ఈ పురాణంబులోపల ♦ నిమిడియున్న
కథలలో నొక్కటైనను ♦ కలతలేక
వినిన వ్రాసినవారలు ♦ విబుధ లోక
నందన వనాప్తి ఫలముల ♦ నందుచుంద్రు. ౧౪౧

* ఆశ్వాసాంతము. *

చ॥ నిరవధికా కృపాంబునిధి ♦ నిర్జరనాథ జితాసురాధిపా
వర జయహార్యధైర్య భవ ♦ బంధవిమోచన దివ్యరూపశో
భరతమహాశోపదేశగుణ ♦ భావికలాప కలాపవంద్య శం
కరహిత జన్మశూన్య బహు ♦ కారణకారణ శ్రీరమాధిపా

* ఉత్సాహ *

కలుషకాననాగ్నిరూప ♦ కామినీ మనోస్మరా
జలజనాభ చంద్రహాస ♦ చంద్రికా సదృగ్యశా

సలిలసంయుతాబ్దదేహా ♦ సన్నుతామరాభవా
విలసితా హిరాణ్మహీంద్ర ♦ వేశ్మవేంకటేశ్వరా. ౧౪౩

* తరళవృత్తము. *

గుణ రసాష్టక చంద్ర (౧౮౬౩) సంఖ్య న♦ కుంఠితంబగు శాలివా
హాన శకంబునకున్ సమానము ♦ నౌ వృషాభిద వత్సరం
బునను మాఘవళక్షపక్షము ♦ పూర్ణిమన్ ముగియించితిన్
మనుకుచేడె స్వరూపమైనది ♦ మేరువంశ పురాణమున్. ౧౪౪

గద్య

ఇతి శ్రీమదలర్మేల్మంగానాయక వేంకటేశ్వర పాదారవింద
ధ్యానాసక్త కౌండిన్యసగోత్ర పవిత్ర పాపయాఖ్య
పుత్ర కనకమాంబా గర్భశుక్తి ముక్తాఫల
పూర్ణానంద పాడపల్లి ఆగయాఖ్య
రాజయోగి ప్రణీతంబైన మేరు
వంశ పురాణంబునందు
తృతీయాశ్వాసము
సంపూర్ణం
శ్రీ వేంకటేశ్వరార్పణమస్తు.

కుమార ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె, వరంగల్.

## —♦ ద్రవ్యసహాయకర్త ప్రశంస ♦—

కం॥ శ్రీధవుడగు శ్రీ వేంకట
నాథుం డిల దైవమంచు ♦ నాసింతీను భూ
మిన్ ధార్మిక సంతతికిని
బాధలు లేకుండ జేసి ♦ భద్రము లిడుతన్.

చ॥ పరగను కాకతీయ పరి ♦ పాలిత రాజ్యము నోరుగల్లులో
సిరియును సంపదల్ గలిగి ♦ శ్రీహరిపాద సరోరుహాంబులన్
మరువకయుండు వాడపలి ♦ మాన్యుడుగా గన పెట్టురామయా
ఖ్య రహిని వర్ధిలెన్ సతని ♦ కూర్మి సతీమణి వెంకమాంబయున్. ౨

ఉ॥ వీరల పుత్రులన్ కలుప ♦ ధీరులు జ్యేష్ఠుడు రామచంద్రుడున్
భూరిగుణుండు లచ్చయాయు ♦ పూర్ణకవీంద్రుడు బుచ్చిరాములున్
సార విచారణాపరుడు ♦ సద్గుణశీల శమాది షడ్గుణుం
డారయ సత్తయాభిదుడు ♦ సజ్జనంబుల కల్పవృక్షమా. ౩

ఉ॥ ఈతడు రామలక్ష్మి యను ♦ నింతిని జేకొని ధర్మకార్యముల్
ప్రీతిగ జేయుచున్ గురుల ♦ ప్రేమగ పూజలు సల్పుచుండి తాన్
దాతలనాటి మార్గమును ♦ తప్పక వర్తిలుచుండె నుర్వి యే
రీతిగనైన సత్యవిప ♦ రీతము జేయడు సాధనమందున్, ౪

ఉ॥ మాధవుదృష్టి గల్గియును ♦ మారులు బిడ్డలు గల్గిరా జగ
న్నాథము శ్రీహరీ యనగు ♦ నామయు డెంతయు వెంకటేశ దా
మోదర నామకుల్ సుగుణ ♦ మూర్తులు ప్రేమ కృపా సముద్రులన్
సోదరులై రమాధవుని ♦ శోభిత సత్కృపవృద్ధి బొందిరా. ౫

గీ॥ లక్ష్మినరుసమ్మ సుగుణ వి ♦ లాసవతియు
కడకు కౌసల్య గలిగెను ♦ కాంతియుతయు
నిట్టి సంతానమునుగన్న ♦ యట్టి సత్త
యాఖ్యు డాకనాడు ననుజూచి ♦ యడిగె నిట్టుల. ౬

చ॥ కులము నెఱుంగకుండ బహు ♦ క్రుంగుచుచుండెడి జాతి సోదరుల్
ఫలమని దల్చి, కష్టముల ♦ బాల్పడి మేరు పురాణ గ్రంథముల్
కలికెడు వాక్యజాలముల ♦ కూడికతో రచియించినాడ వీ
కులముకు గౌరవంబును న ♦ కుంఠిత తేజము గల్గ సోదరా.

గీ॥ ఇన్ని కష్టాలకోర్చిన ♦ నింతమైన
కార్యభారంబు దగ్గె నా ♦ కవియలేందరి!
గాన ముద్రించు మనజాతి ♦ గ్రంథమునియు
ద్రవ్యమును యిచ్చె తగినంత ♦ తప్పకుండ.

గీ॥ అచ్చు నొత్తించి ధన్యత ♦ నందినాడ
ద్రవ్యమిచ్చిన సత్త్రయు ♦ ధార్మికునకు
వేంకటాచల నాథుండు ♦ వేడ్క మీర
భోగ భాగ్యంబులిడి సదా ♦ బ్రోచుగాక.

ఇట్లు
గ్రంథకర్త

# గ్రంథాభిమానులు

—♦ అఖిల భారత మేరుకుల సంఘము వారు ♦—

ప్రతి పేరునకు మొదట 'శ్రీ' యనియు చివర 'గారు' అనియు చదువగలరు.

వరంగల్

వాడపల్లి బుచ్చిరాములు కవిగారు
రాయభారపు జగన్నాథం కవిగారు
మల్లెల శోభనాచలపతిరావుగారు

బెజవాడ

గూడూరు రంగయ్య హన్మకొండ
కొటూరం విశోభ, ముత్తయ్య

సికింద్రాబాద్

పోలకం వేంకట్రామయ్య హైద్రాబాద్
మొలుగూరు సత్యనారాయణ వకీలు

సిద్ధుమాక్ వెంకటకృష్ణం ఓవర్సీర్

ఖమ్మంమెట్టు

మాడిశెట్టి వేంకటస్వామిమాస్టర్ ,,
మంతెన చిన్నయ్య, రాజయ్య ఆలూరు

బొంబాయి

### బొంబాయి

శిలాంకోటి స్వామి, నాగయ్య
శికింద్రాబాద్

### హైదరాబాద్

తాళ్ల అడవయ్య నిజాంరాష్ట్ర మేరు కుల చాదరి
బుర్ర నరసింహ్మం నిజాంరాష్ట్ర మేరు కుల సెక్రెటరీ
రాచర్ల హనుమయ్య వుందబజారు
పోలపల్లి బాలయ్య వుందబజారు
సంగ వేంకయ్య లాల్ దరువాజ

### వరంగల్

గూడూరు నరహరి చాదరి
వాడపల్లి నరసింహం
రాయభారపు చినజగ్గంగారి రామస్వామి
రాయిల్ల రామస్వామి వురుసు
అడుప రామచంద్రం కరీమాబాద్
వాడపల్లి వెంకటయ్యగారి రామచంద్రం
రాయభారపు వేంకటాద్రి
వాడపల్లి రామచంద్రందేశాయిప్యాట
రాయభారపు జీడీరాములు
వాడపల్లి సత్తయ్య మంజిబజారు
సోమ నారాయణ
వాడపల్లి పెద్దలింగయ్య
రాయభారపు రామచంద్రంగారి రాఘయ్య
వాడపల్లి కిష్టమ్మ
మాడిశెట్టి లక్ష్మీపతి దేశాయిబజారు
వాడపల్లి లింగయ్య
అడుప రామయ్య
వాడపల్లి నరసింహరాములు
వాడపల్లి లక్ష్మయ్య

### హన్మకొండ

గూడూరు రాఘయ్య చాదరి
రాయభారపు లక్ష్మీపతి
వాడపల్లి దుర్గయ్య
రాయభారపు కిష్టమ్మ
కీర్తి శంకరయ్య బిక్కునూర్
వాడపల్లి రామస్వామి
శ్రీరాము సత్యనారాయణ
మాడిశెట్టి రాజన్న లష్కర్
కీర్తి నరసింహం పరకాల తాలూక సాయంప్యాట

### రంగశాయిప్యాట

పాడిశెట్టి పెద్దయ్య
పాడిశెట్టి జగన్నాథం
పాడిశెట్టి బుచ్చయ్య

### ఖమ్మంమెట్టు

బొడ్డు కొండయ్య
గట్ల వెంకట్రామయ్య
బొలకొండ మల్లయ్య
బొడ్డు గురవయ్య
వెన్న లచ్చయ్య

### మధిర

బొడ్డు వేంకయ్య
మొలుగూరు పుల్లయ్య

బొడ్డు వీరయ్యగారి గురవయ్య

మొలుగూరు రాఘయ్య

బొడ్డు జానకిరామయ్య

### కొత గూడెం

మాడిశెట్టి పెద్దన్న

పెద్ది నరుసయ్య

రాయి లక్ష్మయ్య

దీకొండ వెంకటేశం

వాడపల్లి భూమయ్య

రాపర్తి అనంతయ్య

### బూర్గంపాడు

మాడిశెట్టి కొండయ్య చాదరి

రాయి నరుసయ్య

బొమ్మదేని నరుసయ్య

మాడిశెట్టి రామస్వామి

రాయి గౌరయ్య

గూడూరి వెంకయ్య

రాపర్తి వెంకటనరుసయ్య

కీర్తి వెంకయ్య

### సింగరేణి

మాడిశెట్టి నరుసయ్య చాదరి

రాయి వెంకటయ్య

వాడపల్లి వెంకటేశం

రాయి యెతిరాజం

వాడపల్లి వెంటయ్య

వాడపల్లి బ్రితుకయ్యగారి నరసింహం

రాయి తాపాల్

వాడపల్లి రామయ్య

కీర్తి మల్లయ్య

వాడపల్లి లక్ష్మయ్య

చేగూరు వెంకట్రామయ్య

బొమ్మదేని వెంకట నరుసయ్య

మాడిశెట్టి చంద్రయ్య

రాయి రాజయ్య

రాయి పెద్దమల్లయ్య

### బొంపల్లి

మొలుగూరి రాజయ్య కరీంనగర్ జి॥

బుర్ర రాజయ్య

మొలుగూరి పెదల

బుర్ర పోశెట్టి

మొలుగూరి చినలక్ష్మయ్య

,, పెదగోపయ్య

మొలుగూరి లింగయ్య

ర్తి చినగోపయ్య

పాడిశెట్టి నరుసయ్య

పాడిశెట్టి మాధవదాసు

### కేశవపట్నం

రాపర్తి రాజయ్య

రాపర్తి సాంబయ్య

రాపర్తి కూశయ్య

ర్తి వెంకట్రామయ్య కమాన్‌పురం

ర్తి రామయ్య ,,

అక్కు పెదలచ్చయ్య బ్యాగంప్యాట

అక్కు చినలచ్చయ్య ,,

మాడిశెట్టి వీరయ్య గర్రెపల్లి

బొమ్మదేని హనుమంతు కిష్టంప్యాట

రామగిరి లక్ష్మయ్య జూలపల్లి

నోముల భూమయ్య ముప్పిరితోట

నాంపల్లి వెంకట్రామయ్య తక్కళ్లపల్లి
రాయి నరుసయ్య కొత్తపల్లి
రాపర్తి వెంకయ్య విలాసాగరం
మాడిశెట్టి రాజయ్య గనిముక్కుల
సంగ రాజయ్య గంగిపల్లి
రాపర్తి రంగయ్య అర్లకొండ
మాడిశెట్టి యామాద్రిగారి రామయ్య
మానకొండూరు
రాపర్తి రామయ్య కండికటుకూరు
మాడిశెట్టి లింగయ్య జగిత్యాల
వాడపల్లి వెంకయ్య మానకొండూరు
మాడిశెట్టి నరుసయ్య తిమ్మాపురం
పొన్నాకల నరుసయ్య కోలనూరు
శీలం నాంపెల్లి వేములవాడ
కీర్తి చంద్రయ్య పచ్చునూరు
రామగిరి రాజయ్య ఎల్లారెడ్డిపేట
రామగిరి లక్ష్మీపతి ఘాటూరు
[illegible]డపల్లి రాజశేఖరం వెలంపల్లి
రామగిరి రాజయ్య నందిమేడారం
ముప్పిడి చంద్రయ్య సుల్తానాబాద్
రాయి పెద్దనరుసయ్య కొత్తపల్లి
మాడిశెట్టి వీరస్వామి దేశాయిపేట
శీలం దుర్గయ్య పాపన్నపేట
శీలం లచ్చయ్య ,,
గూడూరు కొమురయ్య శనిగరం
కీర్తి రంగశాయి పెద్దకొరుపోలు

హైద్రాబాద్.

తాళ్ల వెంటయ్య,
గట్లు నరుసయ్య

నోముల విఠల్
కీర్తి వెంకయ్య
కీర్తి శరదయ్య సికింద్రాబాద్
మాడిశెట్టి జగ్గయ్య సుల్తాన్ బజారు
రాపర్తి రెడ్డిగారి రాజన్న
రాపర్తి రెడ్డిగారి తాపాల్
రాపర్తి రెడ్డిగారి లక్ష్మయ్య
మునిగాల రాజన్న
మునిగాల భద్రయ్య
అలువాల చిత్తహరి
మునిగాల మర్రిపల్లి రామయ్య వెంకయ్య
మాడిశెట్టి గౌరయ్య కాచిగూడ
గూడూరి వీరయ్య గోలంపల్లి

బొంబాయి

గజెల్లి శివయ్య నాగయ బోయినపల్లి
రాపర్ల పండరినాథ్ రాంచందర్,
అవురంగాబాద్ (పల్లి
కొట్టూరు కొంబయ్య శివయ్య, మును
సంగ ఆనంతయ్య, బుచ్చయ్య (రము
సంగ నారాయణ, నరసయ్య రత్నాపు
రాజులదేవి నరుసయ్య, బాలయ్య,
హైద్రాబాదు
కయిరపు మల్లయ్య వెంకయ్య, సిద్దిపేట
గట్లు మల్లయ్య, నరసయ్య. దరురు
బుర్ర హనుమయ్య, భోజయ్య హైద
రాబాదు (పల్లి
శిలాంకోటి వీరయ్య వెంకయ్య, బోయిన
పాడిశెట్టి మల్లయ్య కిష్టయ్య సిద్దిపేట
గట్లు స్వామి నరసయ్య

సోమ నారాయణ, దమ్మయ్య శిరికొండ
పోలకం యల్లయ్య లక్ష్మయ్య చౌదరి
సంగ నరసయ నరుసయ్య, రత్నాపురం
సంగ అంతయ్య బుచ్చయ్య డ్యాగాం
సంగ పెద్దలింబయ లింబయ్య కోరుట్ల
గట్ల నారాయణ లింగయ్య ,,
గట్ల రామయ్య నరసయ్య ,,
గట్ల నరసయ్య కిష్టయ్య ,,
గట్ల లింబయ్య అంతయ్య ,,
సంగ వెంకయ్య బుచ్చయ్య చొప్పదండి
సోమ నరసయ్య దమ్మయ్య శిరుకొండ
గట్ల నరసయ్య నరసింహులు ,,
రెబ్బ నరసయ్య శాయన్న దరిపెల్లి
బతుకపల్లి వెంకట్రాములు, నరసయ్య
రాయిల్ల నరసయ్య వెంకయ్య జగిత్యాల
కర్నె యల్లయ్య, వెంకయ్య ,,
సోమ గంగారాం లక్ష్మయ్య మెట్టుపల్లి
సంగ రాజయ్య, భోజయ్య మొంరావు
పేట
కర్నె లింబయ, వెంకయ్య మెట్టుపల్లి
రాచర్ల గంగారాం శాయన్న. రామడ్గు
గట్ల బుచ్చయ్య హనుమంతు, వూటపల్లి

సంగ చిన లింబయ్య లింబయ, కలకోట
ఆత్మకూరి బుచ్చయ్య కూచయ్య ,
గట్ల భూమయ్య, లక్ష్మయ్య కోరుట్ల
మాడిశెట్టి లింగయ్య, నరసయ్య, యె
ముదుల్ల (పల్లి
వాడపల్లి లక్ష్మీపతి పంతులుగారు వెలం
కర్నె నరసయ్య గిద్దెముత్తవరం
పాడిశెట్టి నరసయ్య ఆకినెపల్లి
మాడిశెట్టి నారాయణ బూజునూరు
గట్ల చంద్రయ్య బుద్దవరం
వాడపల్లి వెంకటయ్య పంతులు పర్లపల్లి
పాడిశెట్టి రామస్వామి ఆకినెపల్లి
మాడిశెట్టి నరసయ్య కిష్టమ్మ అంకీస
రాయిళ్ల గోవిందరాజులు. యెల్లమ్మ
బజారు, వరంగల్
బుర్రా కేశవులు గిర్మాజిపేట ,,

హైదరాబాద్

సేనాపతి వెంకటస్వామి, దేవరకదిర
గోవిందరావు, పత్తర్ ఘట్
కన్నయ్య లాల్ దరువాజ
గణేశం నూగత్ పురం

ఈ గ్రంథాభిమానులెల్లరు దయతో నొసంగిన ద్రవ్యము మేరువంశ పురాణము వచనకావ్యము 3000 ప్రతులకే సరిపోవుటచే నచ్చొత్తించి, జాతీయ సోదరుల హస్తపద్మము లలంకరింపజేసితిని. ఈ పద్యకావ్యమును శ్రీయుత వాడపల్లి సత్తయ్యగారి ద్రవ్యసహాయముచే ముద్రింపించితిని.

ఇట్లు
గ్రంథకర్త